ప్రేమ పవిత్రమైంది.

ప్రేమను
ఆకర్షించలేదు
కదిలించలేదు

# CHARUGUPTHA

**Written by**
"SANGHODDHARAKA", "VYSYABHUSHANA"
"SAMAJASEVA NISHNATHA", "SAHITHYA RATNA"
**Sri P. LAKSHMIKANTHAM SHRESHTY**

Publishers
**VYSYA PRABODHINI PUBLICATIONS**
Vasavee Bhavan
Jayanagar Colony
CUDDAPAH - 516 002.

First Edition :
August, 2000

PRICE :
**Rs. 20-00**

Printers :
**VASAVEE GRAPHICS**
Cuddapah - 516 002. Ph : 45025, 44911.

మా తండ్రి
'సంఘోద్ధారక', 'వైశ్యభూషణ'
'సమాజసేవానిష్ణాత',

శ్రీ పాలాది లక్ష్మీకాంతం శ్రేష్ఠి
సరసంగా - సరళంగా,
పద్యం - పాట - వచనం
వ్రాయగలవారలు.
మంచి పరిశోధకులు.
పత్రికా రచయితలు.
32 సంవత్సరాలుగా
"వైశ్యప్రబోధిని"ని
ఎనలేని పట్టుదలతో
నడిపిస్తూ
సదా సాహిత్యసేవ చేస్తూన్నారు.
మా తండ్రిగారు
మేము కోరగానే మా కులదేవత
శ్రీ వాసవీదేవి
ఇతివృత్తాంతాన్ని
కమనీయంగా - వ్రాసి
ఇవ్వగా
1995, లో
ఈ, మా -
వైశ్యప్రబోధినీ పబ్లికేషన్సు
తరపున
'వాసవి' అనుపేర

ముద్రించి,
రసజ్ఞులైన పాఠకులకు అందించాము.
'వాసవి'కి
అపార ఆదరణ లభించింది.
ప్రచురణకర్తలుగా,
అభినందనలు అపారంగా అందుకొన్నాం.
ఇప్పుడు
మా నాన్నగారు
తాను వ్రాసిన
"చారుగుప్త"ను
అందమైన అక్షరాలతో, ముద్రించి
రసజ్ఞులైన పాఠకులకు
అందించే భాగ్యాన్ని కల్గించారు.
వారికి మా సహస్రప్రణామాలు.
'వాసవి'ని
ఆదరించి - అభినందించినట్లుగానే
చారిత్రకనేపథ్యం గల
"చారుగుప్త"-నూ
ఆదరిస్తారనీ -
అభినందిస్తారనీ
ఆశిసూ............

- పి.వి. రమేశ్
పి. భూపేశ్
పి. ఉమామహేశ్
(ప్రచురణకర్తలు)

# అంకితం

నా

ఈ జన్మకు

కారకులైన

అనురాగ పూర్ణులు

అమృతహృదయులు

యశశ్శరీరులు

మా తల్లి శ్రీమతి పాలాది ఈశ్వరమ్మ

మా తండ్రి శ్రీ పాలాది నారాయణశ్రేష్ఠి గారలకు

"అలనాడొక
మహారాజ సంపత్తితో,
తిరుగులేని పలుకుబడితో,

విరాజమానుడై
మంత్రిపదవి నధిష్ఠించుట
సామాన్యవిషయంకాదు".

డాక్టర్ సి.వి. సుబ్బన్న

# భూమిక

'కళాతపస్వి' అడవిబాపిరాజు గారు. వీరి రచనలు నాకు చాలా ఇష్టం. వీరి రచనల్లో ఆద్యంతమూ ఒకనాదం ఉంటుంది.

"పద్యంలో నాదం ఉండాలి" అంటాడు మా అన్నయ్య 'కవిరాజశేఖరులు' శ్రీ చిటిప్రోలుకృష్ణమూర్తిగారు.

పద్యానికే కాదు. గద్యానికీ నాదం అవసరం అంటాను నేను.

బాపిరాజు గారు గొప్పభావుకులు. మంచి చిత్రకారులు. శిల్పులు. గాయకులు. సర్వతోముఖప్రతిభ కలవారు. శాస్త్ర పరిజ్ఞానం కలవారు. వాక్యనిర్మాణంలో దిట్టలు. ఎన్నిసార్లు చదివినా విసుగు పుట్టించవు వీరి రచనలు. మరీమరీ చదవా లనిపిస్తాయి.

బాపిరాజుగారు తమరచనల్లో పాత్రలను పాఠకుల కళ్ళముందు బొమ్మకట్టిస్తారు.

బాపిరాజుగారి రచనల్లో చారిత్రకనేపథ్యంగలవే ఎక్కువ. అందులో ఒకటి 'హిమబిందు'.

ఈ చారుగుప్తకు ఆ హిమబిందు ఆధారము. అయితే హిమబిందు బృహన్నవల. ఆ నవల్లో అవసరమైనంతే తీసుకొన్నాను.

హిమబిందులో శ్రీకృష్ణ-విషకన్య, సువర్ణశ్రీ-హిమబిందు, సమవర్తి - నాగబధనికలు నాయికా నాయకులుగా కథ నడుస్తుంది

పై జంటలు మూడింటిలో శ్రీకృష్ణ - విషకన్య, సువర్ణశ్రీ, హిమబిందువులనే ఈ చారుగుప్తకు తీసుకొన్నాను.

పద్యానికే కాదు గద్యానికీ నాదం అవసరమంటానని ముందే ఉగ్గడించాను. ఆ నాదం ఈ నవల్లో తొలి నుండీ చివరి వరకూ ఉండేందుకు సర్వజాగ్రత్తలూ తీసుకొన్నాను. చారుగుప్తేకాదు. వాసవిలో కూడ ఆద్యంతము నాదం ఉండేటట్లుగా వ్రాశాను. వాసవి నా తొలి నవల. ఐతిహాసిక ఇతివృత్తం కలది.

నవలల విషయంలోనే కాదు. ముప్పై సంవత్సరాలకు పైబడి నా సంపాదకత్వములో నడుస్తున్న 'వైశ్య ప్రబోధిని' కూడ ఇంతే. చిన్నపత్రికలచరిత్రలో సుదీర్ఘకాలం అకుంఠితంగా ఒక్కనెల కూడ

ఆగకుండా నడిచిన పత్రిక "వైశ్యప్రబోధినే". మీ రచనల్లో ఇంపు ఉంటుంది. పాఠకులను మరీమరీ చదివిస్తాయి" - అంటూ పలువురు అభినందిస్తున్నారు. అభినందించే వారిలో కొందరు మహాకవులు. కొందరు గొప్పపండితులు - ఈ నాలుగు మాటలు స్వోత్కర్షతో మలినములైనవి. పాఠకులు మన్నించాలి.

అంధ్రులు స్థాపించుకొన మహాసామ్రాజ్యాలలో చెప్పుకోదగినవి నాలుగు. అందులో మెదటిది శాత(శాలి)వాహనసామ్రాజ్యము. ఈ చారుగుప్త శాతవాహనసామ్రాజ్యమునకు చెందినదే. రెండవది చాళుక్య సామ్రాజ్యం. మూడవది కాకతీయసామ్రాజ్యం. నాల్గవదీ చివరిదీ విజయనగరసామ్రాజ్యం.

శాతవాహనులు శకకర్తలు. ఇప్పటికీ శాలివాహనశకాన్ని చెప్పుకొంటూనే ఉన్నాం. ప్రథమాంధ్రమహాసామ్రాజ్యస్థాపకులు శాతవాహనులే. శ్రీ ముఖుడు ప్రథమాంధ్ర శాతవాహన ప్రభువు. వీరి కుమారుడు శ్రీ కృష్ణశాతవాహనుడు. ఈ "చారుగుప్త"లో వీరిర్వురూ ఉన్నారు.

చారుగుప్త కేవలం వర్తక సార్వభౌముడేకాదు. అణువణువునా దేశభక్తి ఉప్పొంగే మహనీయుడు. త్యాగశీలి.

ప్రథమాంధ్రమహాసామ్రాజ్యస్థాపనకు జంగమరూపమైన మూలస్తంభము.

పట్టుపట్టి - వ్యయభారాన్ని నెత్తిన వేసుకొని-ప్రభువు శ్రీముఖునిచే జైత్రయాత్రలు నడిపించి మహాసామ్రాజ్య స్థాపన చేయించిన దేశభక్తుడు.

వైశ్యులు ధనార్జనలోనే కాదు. దేశభక్తిలో కూడ దిట్టలు. దేశానికి అవసరమైనప్పుడు ధనాన్నీ-ప్రాణాన్నీ వారు తృణప్రాయంగా పరిగణించారు.

"అక్బరు చక్రవర్తిని ఎదుర్కోవడం నాకు సాధ్యముకాదు"- అను నిశ్చయానికి వచ్చిన రాణాప్రతాపున్ని ప్రోత్సహించిందీ, నేనున్నా-పరాక్రమించు అని ముందుకు నడిపించిందీ మహామంత్రి భామశాహ్,-

రెడ్డిరాజ్యస్థాపనకూ-విస్తృతికీ - రక్షణకూ ప్రాణభూతుడు అవచి తిప్పయ్య,

- ఇలా ఎందరో వైశ్యులు చరిత్రలో మనకు కన్పిస్తారు.

బాపిరాజుగారు తన నవలకు 'హిమబిందు' అని పేరు పెట్టారు. నవల్లో హిమబిందు పేరుకన్నా చారుగుప్తపేరే ఎక్కువ కన్పిస్తూంది. అయితే బాపిరాజుగారు హిమబిందు అనే ఎందుకు పేరు పెట్టారు? ఆలోచించా.

హిమబిందు ప్రేమ నిశ్చలమైంది. తిరుగులేనిది. చక్రవర్తి భర్త అవుతాడన్నా ఆమె మనస్సుమారలేదు. తనజన్మకు కారణమైన తండ్రి ఎంత చెప్పినా, ఎందరితో చెప్పించినా, హిమబిందు తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. చివరకు తను అనిర్వచనీయంగా ప్రేమించిన సువర్ణశ్రీ చెప్పినా, హిమబిందు తన మనస్సును మార్చుకోలేదు. విశాలాంధ్ర రాజ్ఞీపదవినే పరిత్యజించింది. స్వచ్ఛమైన ప్రేమకు ఇంతకన్నా ఉదాహరణ ఎందుకు? అందుకే బాపిరాజు తన నవలకు హిమబిందు అని పేరు పెట్టారు, అని భావిస్తున్నా.

నవల్లోని కథనుబట్టి, కథలోనిపాత్రల ప్రాధాన్యతను పట్టి నేను ఈ నవలను 'చారుగుప్త' అన్నాను.

సామాన్యులు కూడ సులభంగా, సరసంగా చదవాలని ఆ బృహన్నవలను ఇలా చిరునవలగావ్రాసి పాఠకులకు అందిస్తున్నాను.

ఈ నవల్లో ఏదైనా మాధుర్యంకానీ, గొప్పతనం కానీ పాఠకులకు కన్పిస్తే అది కళాతపస్వి బాపిరాజుగారికే చెందుతుంది.

ఈ చారుగుప్తకు, -

'చారుగుప్త' అను శీర్షికన ముందు మాటలు వ్రాసి పంపుచూ - కొన్ని ముఖ్య సవరణలు చూపించి ఆశీర్వదించిన సరస్వతీపుత్రులు, అవధానిపితామహులు, అమృతహృదయులు డాక్టర్ సి.వి. సుబ్బన్న శతావధానులకూ, -

"అద్దాలమేడ" అనుశీర్షికన ముందు మాటలు వ్రాసి పంపుచూ ఆశీర్వదించిన ఆంధ్ర ప్రదేశ్ అధికారభాషాసంఘంమాజీఅధ్యక్షులు,

రాష్ట్రపద్యకవితాసదస్సు అధ్యక్షులు, పూజ్యులు శ్రీనండూరు రామకృష్ణమాచార్యులకూ,

"సాహితీసౌరభం" అను పేర ముందు మాటలు వ్రాసి పంపిన న్యూఢిల్లీ లోని ఆల్ఇండియా నేషనల్ ఛానల్ డైరెక్టరు డాక్టర్ ఆర్.అనంతపద్మనాభరావు గారలకూ, -

"మనోజ్ఞతామాధుర్యాలతావళం" అను శీర్షికన ముందు మాటలు వ్రాసి పంపిన, అనంతపురం జిల్లా పెనుకొండలోని శ్రీ పరిటాల శ్రీరాములు, ప్రభుత్వకళాశాల ప్రధానాచార్యులు అవధానులు శ్రీ ఆశావాది ప్రకాశరావు గారలకూ, -

-- నాకైమోడ్పులు

అచ్చు తప్పులను దిద్ది, రెండు మూడుశబ్దదోషాలను నాదృష్టికి తెచ్చి సహకరించిన సాహితీమిత్రులు విద్వాన్ శ్రీ కట్టా నరసింహులు,

ఈ నవల అనుబంధములోని- వైద్యశాస్త్రపరమైన కొన్ని శబ్దాలకు వివరణలు ఇచ్చి సహకరించిన, పూజ్యులూ, వైద్యాచార్యులు బ్రహ్మశ్రీ ఐలావఝులరామకృష్ణశాస్త్రి, సాహితీ మిత్రులు శ్రీ పి.సుబ్బరాయుడు, శ్రీ సాగర్‌జయ్యదీ,

-- గారలకూ నా కృతజ్ఞతలు.

నారచనలను తమ "వైశ్యప్రభోధినిపబ్లికేషన్సు" ద్వారా ప్రచురిస్తున్న నా చిరంజీవులు పి.వి.రమేశ్, పి.భూపేశ్, పి.ఉమామహేశ్ గారలకు నా ఆశీస్సులు.

ఈ చారుగుప్తను రసరమ్యంగా ముద్రించిన 'శ్రీ వాసవీ గ్రాఫిక్సు' సిబ్బందికి నా అభినందనలు.

సంఘోద్ధారక, వైశ్య భూషణ,
సమాజసేవానిష్ణాత, సాహిత్యరత్న,

**పి.**

'వాసవి'
జయనగర్ కాలని,
కడప.
విక్రమ - ఆషాఢ శుద్ధ చతుర్దశి మందవాసరం 15-7-2000.

కనకాభిషేక, గజారోహణ, హస్తకంకణ, కవి
గండపెండేర సత్కారశాలి, 'అవధాని పితామహ'
**డా.సి.వి.సుబ్బన్న శతావధాని,** M.A., Ph.D., D.Litt.,
ప్రొద్దుటూరు - 516 360.
Tel : 52239
(S.T.D : 08564)

తేది : 12-7-2000

# చారుగుప్త

శ్రీ లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారు నవలలు వ్రాయుటయందును చెయ్యితిరిగిన రచయిత. ఈ చారుగుప్త కృతి దేశభక్తికి, ఆంధ్రాభిమానమునకు, వణిక్సాచివ్యమునకు ఆదర్శము. హిమబిందు వణిక్కన్య. చంద్రబాల ద్విజకన్య. వీరి వివాహశుభములతో కథ సుఖాంతమగును. ఇది వస్తుతః శృంగారమూలమే అయినను, శృంగారము - గట్టులకు లోబడి ప్రవహించు నిర్మలగంగానది వలె సాగినది. 81 పుటలో "ప్రభువులు ధూర్తులగుచున్నారు" అన్న మాట పరమరమ్యమై శృంగా రమును ప్రజ్వలింపజేయుచున్నది.

ఇందు విషకన్యను అమృతకన్యగా మార్చుట విశేషము.

చమత్కృతు లెన్నియైన నుండవచ్చును. కథలో పఠితను ఉవ్విళ్లూరించు లక్షణము లేకున్నచో అది నవల కాదు. ఆ లక్షణ మీ నవలలో సమృద్ధిగానున్నది. పుస్తకము తీసికొని, యిపుడు కొంత, రేపు కొంత చదువుదమని ఉపక్రమించితిని కాని, అంతా పూర్తిగా చదువుదనుక లేవలేకపోతిని. ఇంత కంటె నిదర్శన మేమి కావలెను?

అలనాడొక వైశ్యశ్రేష్ఠుడు మహరాజసంపత్తితో, తిరుగులేని పలుకుబడితో, అఖండరాజనీతికౌశలముతో విరాజమానుడై మంత్రి పదము నధిష్ఠించుట సామాన్య విషయముకాదు. గుప్తమైన యీ చరిత్రాంశముల నుద్ధరించి, యింత చారువుగా చిత్రించిన శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారు తమ సంఘోద్ధారక బిరుదము సార్థకము చేసి కొన్నారు.

**డా.సి.వి.సుబ్బన్న శతావధాని.**

శ్రీ విక్రమనామ సంవత్సరాషాఢ శుద్ధైకాదశి

# అద్దాల మేడ

శ్రీ నండూరు రామకృష్ణమాచార్య,
అధ్యక్షులు, రాష్ట్రసాయిపద్యకవితాసదస్సు

సంఘమునకు, సాహిత్యమునకు గల అవినాభావసహజ సంబంధము సహృదయులకు స్వయం వ్యక్తమయ్యే సుకుమార సుందర విషయం.

'మనుచరిత్ర' స్వారోచిష మనువుకు సంబంధించిన పురాతన కథ. అయినా సరే మనుచరిత్రలో శ్రీ కృష్ణదేవరాయలయుగం ప్రతిఫలించింది. సహృదయులైన పరిశోధకులు ఆవిషయాలను వేయికన్నులతో వెదకి వివరించారు.

చిరంజీవి లక్ష్మీకాంతంశ్రేష్ఠి వ్రాసిన ఈ చిరునవలలోని ఇతి వృత్తం శాతవాహనయుగానికి సంబంధించినది. నాకు చరిత్ర రచన అంటే ఇష్టం. "ప్రాచీనదక్షిణభారతచరిత్ర"ను వ్రాశాను.

ఈ సందర్భంలో నాకు ఒక పరిహాసగాథ జ్ఞాపకం వస్తోంది. శతాధిక నవలలు వ్రాసిన ఒక గ్రంథకర్తతో ఒక చరిత్రకారుడు అన్నాడట అధిక్షేపణధోరణిలో "మీనవలలో మీరు వ్రాసిన పేర్లు నిజాలు కావు. ఆయాతేదీలు సరిపోవు"– అని.

"ఓ చరిత్రకారుడు గారూ! మీరు వ్రాసిన చరిత్రలో పేర్లు నిజాలు కావచ్చు. తేదీలు సత్యాలు కావచ్చు. కానీ మిగిలినవి అన్నీ అబద్ధాలే. అదే మీ చరిత్ర రచనకు, మా నవలా రచనకు గల భేదం – అని ఆ అధిక్షేపణలకు నవలలువ్రాసిన గ్రంథకర్త సమ్యక్ సమాధానం చెప్పాడు. చిరంజీవి లక్ష్మీకాంతంశ్రేష్ఠి నవల "చారుగుప్త"లో శాతవాహనయుగం పఠితల కన్నుల యెదుట సాక్షాత్కరిస్తోంది.

"చారుగుప్త" నవల శాతవాహనయుగం ప్రతిబింబించే అద్దాల మేడ.

## II

చరిత రచనయన్న అరయబొంకులబొంత
అందు"నిజము' తోచు అణువువోలే
నిజము పేరులన్ని, నిజము తేదీలన్ని
మిగిలినట్టి వెల్ల మిథ్య-మిథ్య

చరిత్ర పాఠ్యగ్రంథాలు రక్త మాంసనాడీమండలరహితమైన కంకాళములే. శాతవాహనయుగం సర్వస్వం చారుగుప్తనవల్లో విశ్వరూపప్రదర్శనవలె కన్పిస్తుంది. ఈ ఘనవిజయాన్ని సాధించిన రచయిత చిరంజీవి లక్ష్మీకాంతంశ్రేష్ఠిని ఆశీర్వదిస్తున్నాను. అభి నందిస్తున్నాను.

చరితరచనలోన సత్యమ్ము-స్వల్పమ్ము
అరయ-నిజము నవల కంతరాత్మ
కాదు నవల - శుద్ధ కల్పనా కథ-కాదు
నవరసరుచిరమ్ము నవల నేడు.

"చారుగుప్త" నవల "గద్యం కవీనాంనికషం వదంతి" అన్న ఆలంకారిక వాక్యానికి ఉదాహరణ ప్రాయము. నేడు చక్కని చిక్కని పద్యాలు వ్రాసే కవులలో చిరంజీవి లక్ష్మీకాంతంశ్రేష్ఠి ఒకరు. వీరి పద్యాలలోని పూలగుత్తులనెత్తావి 'చారుగుప్త' నవల్లో కూడ గుబాలిస్తోంది.

చదివి చదివినాడ-చారుగుప్తుని గాథ
కాదు-నవల-వచనకవిత గాని,
లాస్యమాడు-కవిత లక్ష్మీకాంతముసెట్టి
గద్య మందుగూడ పద్యపక్కి.

భారతీయచరిత్రలో వైశ్యప్రముఖులు నిర్వహించిన భూమికను చిరంజీవి లక్ష్మీకాంతం శ్రేష్ఠి ఈ నవలలో హృదయం గమంగా అభివర్ణించారు.

ఈ నవలలో ఉజ్జయినీ ప్రసక్తి ఎక్కువగా ఉంది. ఉజ్జయిని-దేశ విదేశాలకు పోయేదారులకు కూడలి. సాంస్కృతిక పరపరాగసమ్మేళనమునకు గరిమనాభి. భౌద్ధ సంస్కృతి-సనాతన భారతీయ వేదసంస్కారం గంగాయమునలవలె సంగమించాయి. రచయిత శ్రేష్ఠి సాక్షిభూతుడుగా తటస్థుడుగా నిర్వికార నిర్వికల్ప నిరంజనుడై ఈ నవలలో ఆర్ష, బౌద్ధధర్మములను వివరించాడు. విషకన్యపాత్ర ఈ నవల్లో పేర్కొనదగింది. విషకన్యను గూర్చి శ్రీ శ్రేష్ఠి సేకరించిన సమాచారం-పూర్వచారిత్రక పరిశోధకులకు తలమానికం.

ఇంకో ముఖ్యవిషయం. ఆర్యవైశ్యులు వ్యాపార పరాయణులు కాబట్టి సహజశాంతి ప్రియులు.

ఆర్యవైశ్యవరులు - ఆంధ్రదేశమునందు
దానకర్ణులైన ధర్మపరులు
వాసవీకుమారి వారి దేవతయయ్యె
త్యాగయజ్ఞ యోగ ధన్యచరిత

రచయిత లక్ష్మీకాంతంశ్రేష్ఠి వైశ్యకులభూషణుడే కాక - సంఘసేవాపరాయణుడు. వైశ్యప్రబోధినీ పత్రికకు సంపాదకుడు. ప్రచురణకర్త,. ఆర్యవైశ్యసంస్కృతికి-జంగమసజీవధ్వజస్తంభం. పద్యకవితా ప్రియుడు.

చిట్టచివర సింహావలోకనంగా చెప్పవలసిన మాటలు.

"చారుగుప్త" ఒక చిన్ననవల. అడవిబాపిరాజుగారి నవల 'హిమబిందు' సాహితీ సుషమాశోభాసుకుమారం అయితే, చారుగుప్త - స్థూలదృష్టితో చూస్తే చిఱునవలే కావచ్చు. సూక్ష్మ దృష్టితో చూస్తే చారుగుప్త" ఒక ప్రచ్ఛన్ననాటకం. అపరాధ పరిశోధన కావ్యంలో నీటి మీద తైలబిందువు వలె వ్యాపించి - ఉత్కంఠ -

ఉద్వేగం- ఊష్మలత చారుగుప్తలో అడుగడుగున కన్పిస్తాయి. ఈ నవలలోని సంభాషణచారిమ - కథాకథనచాకచక్యం - సూచ్యార్థ సూచకమైన పతాకలు అనుశీలిస్తే చారుగుప్త" అంతర్యంత నవలకాదని - నాటకీయరచన అని తేలుతుంది.

ఈ నవల నేను నాలుగు సార్లు చదివాను. ఒకసారి చదివితే విడివడని చిక్కుముడులు-సుడులు కొన్ని ఉన్నాయి.

ప్రాచీనభారతీయచరిత్రపై చిరంజీవి లక్ష్మీకాంతం శ్రేష్ఠికి గల అవగాహన - అభినివేశం నిరుపమానములు.

ఇంత చక్కని, చిక్కని నవల"చారుగుప్త" వ్రాసిన సత్కవి, 'సంఘోద్ధారక'- 'వైశ్యభూషణ' - 'సమాజసేవానిష్ణాత' - 'సాహిత్య రత్న' చిరంజీవి లక్ష్మీకాంతం శ్రేష్ఠికి అటు ఆర్యవైశ్యసంఘంవారు, ఇటు తెలుగుతలి ఋణపడి ఉంది.

**నండూరు రామకృష్ణమాచార్య**

42, పి.జి.రోడ్డు,
సికింద్రాబాద్ - 3.
ఫోను : 7817397

# సాహితీ సౌరభం

డా॥ ఆర్.అనంతపద్మనాభరావు,
డైరక్టర్, ఆకాశవాణి, ఢిల్లీ.

నవల తెలుగు సాహిత్యంలో ఆధునిక ప్రక్రియ. చారిత్రక నవలాకారుల్లో అడవి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి చెప్పుకోదగినవారు. విశ్వనాథసత్యనారాయణ 'ఏకవీర'లో చారిత్రక నేపథ్యం కనిపిస్తుంది. సాంఘికనవలలు కోకొల్లలుగా వచ్చాయి. వారపత్రికల సర్క్యులేషన్ పెరగడానికి రచయిత్రుల నవలలు దోహదం చేశాయి. కొవ్వలివారి నవలలు ఒకప్పుడు దిండుకింద దాచుకొని చదువుకొనేవారు. స్వేచ్ఛా ప్రణయాన్ని చలం విశృంఖలంగా ప్రచారం చేశారు. క్షుద్రశక్తుల కథలు వారపత్రికలకు మసాలా జోడించాయి. వందేళ్ల తెలుగు నవలా వికాసాన్ని పరిశీలించినపుడు ఈ ప్రధాన ఘట్టాలు స్మరణకు వస్తాయి.

బాపిరాజు స్వయంగా చిత్రకారుడు, గేయరచయిత నవలాకారుడు. బాపిబావగా ఆయన ప్రసిద్ధుడు. ఆయన 'హిమబిందు' ఆణిముత్యం. ఆ నవల చదివి ప్రభావితులైన లక్ష్మీకాంత శ్రేష్ఠి 'చారుగుప్త' చారిత్రకనవలగా వెలువరించారు. వైశ్యప్రబోధిని పత్రికానిర్వహణలో, వైశ్యసంఘాల కార్యకలాపాల్లో, తలమునకలుగా తిరిగే వీరికి నవలా రచనకు తీరిక ఎప్పుడు దొరికిందా? అని ఆలోచిస్తున్నాను. సమాధానం యీరోజు ఆంగ్ల దిన పత్రికలో దొరికింది. అహమ్మదాబాదులో గుజరాతీ నవలా రచయితగా సుప్రసిద్ధులు సోలంకి. ఆయన 70 నవలలు వ్రాశారు. నాలుగు దశాబ్దాలుగా రచనా వ్యాసంగం కొనసాగిస్తున్నారు. జీవనోపాధికి అహమ్మదాబాదు మెట్రో ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్‌లో బస్‌కండక్టర్‌గా పనిచేస్తున్నారు.

అందువల్ల రచనావ్యాసంగానికి, తీరిక దొరకడానికి పొంతన లేదు. ఆ తృష్ణ వుండాలి.

లక్ష్మీకాంతశ్రేష్ఠి లోగడ 'వాసవి' నవలను అత్యద్భుతంగా రచించారు. పద్యకవితలపైన, కవులపైన, అవధానులపైన ఆయనకు వల్లమాలిన ప్రేమ. దోమావెంకటస్వామిగుప్త సాహిత్యపీఠ నిర్వహణ యజ్ఞచణులు. ఆయన మైత్రీ సంపన్నులు. ఈ వాతావరణంలో మనం ఈ నవలను చదవాలి.

కథవ్రాయడం సులువు. నవలకు కాన్వాస్ పెద్దది. ఒక పెద్ద తైలవర్ణచిత్రాన్ని తయారు చేయడం వంటిది. పొందికగా అమర్చిన ముత్యాలహారంలా వుండాలి. ఎక్కడా విసుగు రాకూడదు. సన్నివేశచిత్రగా చాతుర్యముండాలి. భాషపై పట్టు కావాలి. 'చారుగుప్త' నవలలో లక్ష్మీకాంతం ఈ సంవిధానాన్ని చక్కగా వ్యక్తపరచారు.

బౌద్ధమతం అప్పుడప్పుడే ప్రాచార్యంలోకి వస్తోంది. వేదమతోద్ధరణకు ఎందరో రాజులు ఆరాటపడుతున్నారు. ఆంధ్రశాతవాహనులు, బౌద్ధమతావలంబనులయ్యారు. 'హిమబిందు' పాత్ర విశిష్టంగా చిత్రించబడింది. కథా, కథనములో వొడుపువల్ల నవల ఆసాంతం చదివిస్తుంది.

విశ్వనాథసత్యనారాయణ అనేక నవలలువ్రాశారు. వారి దొకశైలి. అందులో మనం మంత్రముగ్ధులమై పోతాము. ఒక చిన్న విషయాన్నిరెండుపుటలకు మించి వర్ణించగల చాకచక్యం వారికుంది. ఉదాహరణకు "ఆమె నడచుచున్నది" అని మొదలు పెడతారు. నవలలో ఎన్ని రకాలున్నాయో, ఎంత సౌకుమార్యంవుందో భౌతిక ఆధ్యాత్మిక విషయాలతోపాటు సాంస్కృతిక వాతావరణాన్ని ఆవర్ణనలో పొందుపరుస్తారు.

అదివొక ప్రత్యేక వొరవడి. దానికి ప్రజ్ఞకావాలి. విషయావ గాహనకావాలి. భాషపై పట్టు అవసరం.

ఈ నవలలో ఒక వర్ణన గమనించండి.

“ఆ విశాలసుందరభవనములో ఒక దివ్యమణి ఖచితస్వర్ణ పీఠముపై కూర్చొని, చంద్రబాల వీణెను వాయిస్తు, గీతమును ఆలపిస్తూవుంది. ఆ గీతము సామ వేదమందలిది. స్థూలతిష్యుడు తనమనుమరాలికి వేదగానాన్ని నేర్పాడు. ఆమె గొంతులో మధురిమలు పొంగిపొరలుచున్నాయి. తెల్లని పట్టు చీరను కట్టి, కెంజాయి రంగు రవికను ధరించింది. వెంట్రుకలను పైకికట్టి, దాని చుట్టు మల్లెల సరులను చుట్టి, సిగ మొదటిలో ఎర్రటి మందార పుష్పాన్ని పెట్టింది”- ఈ వర్ణన చదవగానే చంద్రబాల మన కళ్లముందు ప్రత్యక్షమవుతుంది.

చారిత్రక నేపథ్యంలో నవల వ్రాయడం కష్టం. అందులో సాంఘిక నవలల మసాలా జోడించడం కుదరదు. కథను ఎలా అంటే అలా మలుపు తిప్పడం కుదరదు. వాస్తవాలపరిధిలో ఆనాటి చారిత్రక వాతావరణాన్ని రూపకల్పనచేయాలి. నోరి నరసింహశాస్త్రి ‘రుద్రమదేవి’ నవలలో ఈ కల్పన అద్భుతంగా కనిపిస్తుంది. సన్నివేశచిత్రీకరణ సినిమారీలులా మన కళ్లముందు కదలిపోతుంది.

చారుగుప్తలో అలాంటి ఒక సన్నివేశం :

“ఇద్దరు భటులు ఆ ద్వారము వద్ద నిలబడి ఉన్నారు. సువర్ణశ్రీ అతి జాగరూకుడై ఒక ఊపున ఆ భటునిపైబడి కత్తితో అతని తలను ఉత్తరించాడు. అదిగమనించిన ప్రక్కనున్న భటుడు అపాయసూచకముగా ధ్వనిని చేస్తు సువర్ణశ్రీ పైకి రాబోయాడు, సువర్ణశ్రీ అతన్ని తన ఖడ్గముతో నడుము భాగాన కొట్టగా అతడు రెండుఖండములై పడిపోయాడు”.

వొడుపుగా చకచకా సాగిపోయే సన్నివేశం మన కళ్లముందు కన్పిస్తోంది. కథాకథనము, భాషా సౌష్ఠవము, సన్నివేశచిత్రణము ముప్పేటలా పెనవేసుకొని నవలపాఠకున్ని ఆకర్షిస్తుంది. ఈ కథా కాలమునాటికి భారతదేశానికి పాటలీ పుత్రము రాజధాని. ఆనాటి సాంఘిక రాజకీయ వాతావరణం రచయిత వివిధ గ్రంథాల ద్వారా క్షుణ్ణంగా అధ్యయనంచేసి ఆపోశనపట్టాడు. అందువల్ల కథనంలో ఎక్కడా లోటు కనిపించదు.

## నాయికానాయకుల వర్ణన అద్భుతం

సువర్ణశ్రీ : "ఇరవై సంవత్సరాల వయస్సులో ఉన్నవాడు. కోలముఖము. ఎర్రని పెదవులు. కాంతి సహితములైన కన్నులు. దీర్ఘములైన బాహువులు, విశాలమైన వక్షము, చిరునవ్వులు చిందే ఆ నవయువకుని మోమును చూచిన వారు ఆకర్షితులు కాకపోరు".

"హిమబిందు" అతిలోక సౌందర్యవతి. తెల్లనిఛాయ. గుండ్రనిమోము. సొగసైనకనుబొమ్మలు. నల్లని కన్నులు. నాతితీక్షణములైన దృక్కులు. చిరుగుంటలు గల చికిలి బుగ్గలు. తెల్లని పల్వరస గలిగి మధుర ప్రణయారాధకులను క్షణ మాత్రమున ఆకర్షించగల మనోజ్ఞమైన రూపముగలది.

నవలా రచనలో సిద్ధహస్తులు లక్ష్మీకాంతంశ్రేష్ఠి అనడానికి యిది నిదర్శనం. ఆసాంతం చదివించే 'చారుగుప్త' పాఠకుల ఆదరం చూరగొంటుంది.

**డా॥ ఆర్. అనంతపద్మనాభరావు**
ఎ-223, పండర్‌రోడ్,
న్యూఢిల్లీ - 110 003.

# మనోజ్ఞతా మాధుర్యాల తావళం

ప్రధానాచార్యులు
శ్రీ పరిటాల శ్రీరాములు, ప్రభుత్వకళాశాల
పెనుకొండ, అనంతపురం.

ఇటీవల చారిత్రక నవలలకు తెరపడుతోందన్న బలమైన వాదన ఒకటి వినవస్తోంది. దానిని బలాదూరు చేస్తూ శ్రీపాలాది లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారు ముందుకు దూసికొని వెళ్తున్నారు.

లోగడ, ఆర్షధర్మ ప్రతిష్ఠార్థమై ఆత్మాహుతి గావించుకొన్న 'వాసవి' నవల రచించారు. నేడు దేశభక్తి ప్రాధాన్యతాచణమైన 'చారుగుప్త' అందించారు.

ఈ రెండునూ ఆంధ్రభాషామతల్లికి అమూల్యాభరణాలు.

వీరు సాహితీ సుమనస్కులు. పూర్వకవుల పోకడలెన్నో జీర్ణించుకొని పద్యాన్నేగాక, గద్యాన్ని కూడ సర్వాంగ పరిపుష్ఠ సమలంకృతం చేయగల దిట్టలు. ప్రాచీన సంస్కృతిని సంప్రదాయాన్ని నిలపాలన్న తనివోని తపనతో రచనావ్యాసంగంలో నిమగ్నులగుచున్న కలం యోధులు.

ఎన్నో సౌందర్యాలను కలబోసికొన్నదీ నవల. మరెన్నో మనోజ్ఞతామాధుర్యాలకు తావలమైనదీ నవల. "చారుగుప్త" అన్వర్థ నామధేయం. ఇది "శిల్పసూత్ర లక్ష్యభూత సౌందర్య" (పుటలు 59 & 71) హిమబిందు తుందిల మాతృక. ఇది భిన్న మత సంప్రదాయాల హృదయగ్రంది గంధ బంధురాభ్యుదయభావనాబల విలసిత.

హిమబిందు సువర్ణశ్రీల ప్రణయం అవాంతరాల నెన్నింటినో అధిగమించి పరిణయోన్ముఖం కావటం, విషకన్య అమృత కన్యయై శ్రీకృష్ణశాతవాహను హృదయరాజ్ఞికావటం భారతీయ కావ్యశుభాంత విశ్వాసానికి ప్రాణం పోయటమే.

ఇందులో వైదిక ధర్మ విచికిత్స ఉంది. జీవకారుణ్యముంది. సార్వకాలీన సౌరభ్యముంది. వీరవిద్యలున్నాయి, సర్ప విషహర తంత్రా లున్నాయి. ఉన్నతాదర్శ స్థాపనాయజ్ఞంలో రక్తసంబంధుల్ని గూడ సమిథలుగా చేయ సాహసించిన తపస్సంపన్నులున్నారు. క్షణికోద్రేకాలకు లొంగక, పెద్దలగౌరవప్రతిష్ఠలకు భంగం కలిగించక, పొంగులువారే తొలి యవ్వనాన్నికాపాడుకొన్న లేతహృదయు లున్నారు. స్వామిభక్తిపరాయణుల సాహసయాత్రలున్నాయి. జ్యోతిషశాస్త్రచర్చలున్నాయి.

"పిల్ల వాయువుల్ని తెస్తున్న జాజిపూలవాసన అతని నాసికను తాకితే దాన్ని అతను ఒక తన్వంగి కబరీ పుష్పసంజనిత పరిమళంగా భ్రమిస్తున్నాడు" (పుట 24). ఈ అనుభూతి అంతస్సూత్రంగా నవల అంతటా కనిపిస్తుంది. మధురాక్షర పద సంపుటులతో, ఆలోచనాగమ్యమైన వాక్యవిన్యాసాలతో ఆద్యంతం ఆకర్షణాకేంద్రంగా పఠితలో ఉత్కంఠ కలిగిస్తూ కథ సాగిపోతుంది.

ఈ నవల కళాశాలవిద్యార్థులకు పఠనీయగ్రంథంగా నిర్ణ యించుటకు అన్ని విధాలా తగియుంది. కాగా వీరు పైరవీలు చేయలేరు. "అయంకాలఃనిరవధి, విపులాచ పృధ్వీ" అను అర్యోక్తిపై విశ్వాసముంచాలి. గ్రంథం చివర అర్థ వివరణ యివ్వడం ద్వారా అద్యతనపాఠకులకు మహోపకారం చేశారు మా 'పాలాది' వారు.

శుభం భూయాత్,

**ఆశావాది ప్రకాశరావు,**

4-7-2000.

పెనుకొండ.

## ఈ నవలలోని కొన్ని పదాలకు సవరణలు

| | ఉన్నవిధము | సవరించుకోవలసిన విధము |
|---|---|---|
| పుట 1 | సమంజసనీయము | సమంజసము |
| పుట 4 | ప్రాగ్రాజ్ఞి | రాజ్ఞి |
| పుట 6 | ఫణినున్న | ఫణనున్న |
| పుట 13 | చికిలిగుబ్బలు | చికిలిబుగ్గలు |
| పుట 20 | ప్రమాదకారే | ప్రమాదకారిణి |
| పుట 24 | భృకుటి | భ్రుకుటి |
| పుట 29 | పాశ్చాత్యదీవులు | ప్రాశ్చాత్యద్వీపములు |
| పుట 30 | చిరంజీవీ | చిరంజీవినీ |
| పుట 41 | ప్రపంచనడక | ప్రపంచగతి |
| పుట 50 | శ్వేతనాగు | శ్వేతనాగము |
| పుట 53 | విషగాలులు | విషవాయువులు |
| పుట 62 | ముఖమాటము | మొగమోట |
| పుట 63 | మేధస్సు | మేధ |
| పుట 65 | ఝాము | జాము |
| పుట 68 | విఘడియలు | విఘటికలు |
| పుట 70 | శుభగడియ | శుభఘటిక |
| పుట 71 | సుమనస్వి | సుమనస్విని |
| పుట 72 | చిరకాలకోరిక | చిరకాలవాంఛ |
| పుట 78 | విధిప్రతికూలము | విధిప్రతికూలత |
| పుట 81 | పాదారుణములు | పాదారుణ్యములు |

# చారుగుప్త

"చారుగుప్తా"!

"స్వామీ!"

"ఏమిటో ఆలోచిస్తున్నావు"

"అవును స్వామీ! భరుకచ్ఛము మనకు లోబడనిదే మన వర్తకము ఇనుమడించదు. శాతవాహన సామ్రాజ్యము బలపడదు."

"అందుకు ఏమి చేయాలని ఆలోచిస్తున్నావు."

"భరుకచ్ఛము శాతవాహనుల స్వాధీనము కావాలి. పశ్చిమసముద్ర తీరమందున్న ప్రధాన రేవు పట్టణాలలో భరుకచ్ఛము ఒకటి. ఇప్పుడది భోజరాజుల స్వాధీనములో ఉంది. దాని లాభాన్ని వారే పూర్తిగా అనుభవిస్తున్నారు. భరుకచ్ఛమునుస్వాధీనం చేసుకొన్న పాశ్చాత్య దేశాలలోని వర్తకము మన స్వాధీనము కాగలదు. శాతవాహన సామ్రాజ్యము కొడిగట్టక వెలుగ గలదు. అందుకే ఆ భరుకచ్ఛమును సాధించాలని ఆలోచిస్తున్నాను".

"తథాగతుని బోధలకు నీ ఆలోచనలు విరుద్ధములు కావా? రాజ్య విస్తరణ జరగాలంటే యుద్ధము జరగాలి. యుద్ధము జరిగితే ప్రాణి హింస జరుగుతుంది. బౌద్ధధర్మానికి అహింస ప్రాణసమానమైనది. అందువలన నీ ఆలోచన సమంజసమ్యము కాదేమో?

"గురుదేవా! మీరు మహాపండితులు. ధర్మశాస్త్రములు అనే సముద్రాన్ని పుడిసిట బట్టిన అపర కుంభసంభవులు. మీకు తెలియని ధర్మమున్నదా? ధర్మము- శాస్త్రధర్మము, లోకధర్మము అని రెండు విధములుగదా!"




"అవును"

రాజ్యవిస్తరణ, రాజ్యములో శాంతిభద్రతలు, సుఖశాంతులు నెలకొల్పుట అనునవి లోకధర్మమునకు చెందినవికావా? స్వామీ!'

"కావచ్చు"

"రాజ్యవిస్తరణకుకానీ, రాజ్యసంరక్షణకు కానీ చేయు యుద్ధము వలన జరుగు ప్రాణిహింస హింసకాదని ఇంతకు ముందే పండితులు చెప్పిన సందర్భములున్నవికదా? పైగా అది స్వధర్మమునకు చెందినదికదా? రాజధర్మము- రాజ్యసంరక్షణ, ప్రజలను కన్న బిడ్డలవలె పాలించుట, దుష్టులను శిక్షించుట, అవసరమైనపుడు రాజ్య విస్తరణ చేసికొనుటలేకదా? ప్రాణిహింస బౌద్ధధర్మమునకు విరుద్ధమని యుద్ధమే చేయకపోతే రాజ్యవిస్తరణ మటుంచి రాజ్య సంరక్షణకూడ సాధ్యముకాదు. ఒకవేళ మనము అలా భావించి యుద్ధమునకు సన్నద్ధులము కాకున్న శత్రువులు ఊరకుందురా? అదును చూచి రాజ్యమును ఆక్రమించుకోరా? అందుకే ధర్మమును లోకనీతితో కూడ పరిశీలించి లౌకిక భావనతో తన్నుదాను రక్షించుకొంటూ మొదలుచెడ్డ బేరము కాకుండా ధర్మమును ఆచరించడమే ముఖ్యముకదా? ఈ దృష్టితో చూచినపుడు యుద్ధము అభిలషణీయమే కదా స్వామీ?"'

"వర్తకసార్వభౌమా! నీ వింగడింపు బాగానే ఉంది. కానీ ధర్మపరిశీలన అలా సాగాలనుకోవడం మొదటికే మోసం తెస్తుందని నా భావన. అయినా మా వకునుల ఆలోచనలు లౌకికమునకు ఉపయోగపడవు కదా?"

"గురుదేవా! ఇంతకు ముందటి నా వింగడింపును వేరుగా భావించకండి. అధిక ప్రసంగమని ఆగ్రహించకండి. లోకరీతి ఎప్పుడూ ఇట్లే ఉంటుంది. అందుకే శాతవాహనసార్వభౌములైన శ్రీముఖ మహారాజు కాలంలో ఆంధ్రదేశము తన పొలిమేరలను దాటి వింధ్యకు ఆవల అడుగు పెట్టాలి. అందుకు నావలన కాగలిగినంతా చేస్తాను. నా సర్వస్వాన్ని ధారపోస్తాను."

"చారుగుప్తా! నీ దేశభక్తి అనన్యము. నీవలెనే జనులందరు దేశభక్తిని, స్వామి భక్తినికలిగి, కర్తవ్యమును గుర్తించి ప్రవర్తించినపుడే

ఏదేశమైనా అభివృద్ధి చెందుతుంది."

ఇలా సాగుచూ ఉంది వారి ప్రసంగము. అందులో ఒకరు వణిక్ సార్వభౌములైన చారుగుప్తుడు. రెండవవారు అమృతపాదార్హతులు.

అమృతపాదార్హతులు బౌద్ధసంఘారామకులపతి. శ్రీముఖ శాతవాహనమహారాజుకు గురువు. బౌద్ధధర్మములను చక్కగా అవగాహన చేసికొన్నవారు. బౌద్ధమతగ్రంథాలన్నింటిని కూలంకషంగా చదివినవారు. నిండుగా నాలుగు మూరల ఎత్తు ఉంటాడు. ముఖము మహా కాంతిమంతంగా ఉంటుంది. కాషాయాంబరాలను ధరించి, పాదుకలను తొడుగుకొని ఆయన వస్తూవుంటే బౌద్ధధర్మమే ఆయన రూపంలో వచ్చినట్లుగా ఉంటుంది. కృష్ణానదికిఒడ్డున ధాన్యకటక మహానగరానికి తూర్పుదిశన ఆయన ఆశ్రమం ఉంది. రకరకాల ఫలవృక్షాలతో, పరిమళభరితమైన పూ లతలతో, తరువులతో ఫలసమృద్ధమై పుష్పసౌరభ విలసితమై నిస్తుల ప్రశాంతంగా ఉంటుంది ఆ ఆశ్రమం. ఆశ్రమంమధ్యలో ఒక చిన్న భవనము. ఆ చిన్నభవనము ఆయననివాసం. ఆ ఆశ్రమంలో ఆయన ఉంటాడు. చుట్టూ ఉన్న చైత్యములలో బౌద్ధ భిక్షువులు నివసిస్తూ ఉంటారు. తథాగతుని బోధలు వినేందుకు, అమృతపాదార్హతులను సేవించుకొనేందుకు దూరప్రాంతాల నుండి కూడ జనులు వచ్చి ఆయన ఆశీస్సులను పొందుచూ ఉంటారు. అనేక బౌద్ధ గ్రంథాలకు ఆయన వ్యాఖ్యానాలు రచించారు. పాళీభాషలోనున్న బౌద్ధగ్రంథాలను సరళమైన తెలుగులో అనువదించారు.

చారుగుప్తుడు వర్తక చక్రవర్తి. ఆయనకు సమానులైన ధనవంతులు ఆనాటి భారతముననే కాదు ప్రపంచములోనేలేరు అని ప్రతీతి. తెల్లని శరీరచ్ఛాయతో నాలుగుమూరలకు ఒకపిడికెడు తక్కువగా ఉంటాడు. ఆంధ్రరాజులకు ఆయన శేషుని వంటివాడు. ప్రపంచ మందలి అన్ని దేశాలను చూచి వచ్చాడు. అన్ని దేశాలతో ఆయన వ్యాపారం సాగిస్తున్నాడు. లలితకళాప్రియుడు. సంస్కృతాంధ్ర పాళీభాషలను చక్కగా చదివి భారతీయ సంస్కృతిని జీర్ణించుకొన్న మహామేధావి. ధాన్యకటకమహానగరానికి అనతి దూరమున కృష్ణానది ఒడ్డున నల్లని ఆనీటిలో తెల్లని తన కాంతిని చూచుకొంటూ ఆయన భవనము సోయగాన్ని ఒలకపోస్తూ ఉంది. చుట్టూ ఉద్యానవనము. ప్రపంచ ములో లభించే ప్రతిపుష్పం, ప్రతిఫలం, ప్రతిలత ఆ ఉద్యానవనంలో ఉంది. మధ్య అక్కడక్కడ చిన్న తటాకాలు. ఆ తటాకాల కిరువైపుల చలువఱాతిచప్పటలు.

చారుగుప్తునిభార్య ప్రజామిత్ర. ఆమె మహైశ్వర్యసంపన్నుడైన కీర్తిగుప్తునికుమార్తె.

గాంధార, యవన, పారశీక దేశాలలో కీర్తిగుప్తుడు వ్యాపారంచేసేవాడు. యవనవర్తకుడగు "డెమిత్రియసు" అను వానిబిడ్డ ముక్తావళీదేవిని ఆయన వివాహం చేసుకొన్నాడు. కీర్తిగుప్తుని నివాసభవనము కూడ దాన్యకటకములోనే ఉంది. యవనదేశమునుండి శిల్పులను రప్పించి యవనభారతీయశిల్ప సమ్మిళితంగా భవనాన్ని నిర్మించాడు. ఆయనచే రప్పించబడిన ఆ యవనశిల్పులే ఆంధ్రదేశములోని అనేక చైత్యములలో యవనశిల్పవిధానాలను నిక్షిప్తం చేశారు. అప్పటి నుండే శిల్పమునకు "గాంధారించుట" అను పేరు వచ్చింది.

చారుగుప్త, ప్రజామిత్రలకు ఒకే కూతురు. ఆమె పేరు హిమబిందు. హిమబిందును కని ప్రజామిత్ర కన్నుమూసింది. తండ్రి, తల్లి తానే అయి చారుగుప్తుడా బాలికను అల్లారుముద్దుగా సాకాడు. ఆమె విశాలఆంధ్రమహారాజ్ఞి కావాలని చారుగుప్తుడు కోరుకొంటున్నాడు.

తూర్పున బారెడు ప్రొద్దెక్కింది. వాడిమయూఖములు గలుగు వాని వాడి ఇంకా ఊపు అందుకోలేదు. పొలాల్లోని హాలికులు అంబటి బానల కొఱకు ఎదురు చూస్తున్నారు.

వర్తకసార్వభౌముడగు చారుగుప్తుడు పశుశాలలోకి వెళ్ళి తాను పెంచుచున్న గిత్తలజతను తిలకిస్తున్నాడు. ఆ గిత్తలు మరుదినము చక్రవర్తుల జన్మదినోత్సవాల సందర్భంగా జరుగనున్న పందెమునకు మేపుచున్న గిత్తలు. వాటికి ఆయన "కామందక, కులపాలకులు" అని ముద్దుగా పేర్లు పెట్టాడు. మేలైన పశుజాతికి చెందిన గిత్తలు అవి. గాలికన్నా వేగంగా పోగలవు. వాటిమీద ఈగ వ్రాలినా జారి పడాల్సిందే. చేతులు కట్టుకొని పశుపాలకులు ఆయనచెంత నిలబడి ఉన్నారు.

"తండ్రిగారూ! తండ్రిగారూ!" అంటూ హిమబిందు అక్కడికి వచ్చింది.

"రామ్మా! రా!" అంటూ ఆయన ఆమెను ప్రేమగా పిలిచాడు.

ఆమె వచ్చి తండ్రి పాదాలకు ప్రణమిల్లింది.

"చిరంజీవ! చిరంజీవ! మహారాజ్ఞీ పదవీ సంప్రాప్తిరస్తు" అని ఆమెను ఆశీర్వదించి లేవనెత్తాడు. ఆమె ముఖములో దివ్య తేజస్సు తాండవిస్తూ ఉంది.

తండ్రీ! రేపటి గిత్తలపందెములో గెలుపు మీదే నటగా?

"ఎవరన్నారు?"

"ఒకరుకాదు. ఊరంతా అంటున్నారు. ఎందుకో?"

"బండిని సమవర్తిబావే నడుపుతాడట కదా?"

"అవును."

"ఇంకేముంది? బావ బండిని నడపడమూ, విజయలక్ష్మి వరించక పోవడమూనా? బండిని తోలుటలో బావకు దీటైన మగవాడు ఉన్నాడా? నాన్నా! విశాలమైన ఆ వక్షస్థలము. వెడల్పైన ఆ ఫాలము. మోకాళ్ల వరకు ఉన్న ఆ బాహువులు, దరస్మితసుందర వదనము. మెలిదిరిగిన ఆ మెని కండరాలు. నూనూగుమీసాలు. ఆయన ఒరలో కత్తి. ఇవన్నీ వీరలక్షణాలే కదా? అందుకే ఈ పందెములో విజయము బావదేనని నానమ్మకము. అయినా మీకు మాత్రం సందేహ మెందుకు నాన్నా! చారుగుప్తుడంటే ఈ సర్వభూమండలములోనే గొప్పవర్తకచక్రవర్తి. ఆయనపెంచే గిత్తలుమాత్రం సామాన్యములా?"

"కావచ్చు హిమా! కానీ పందెంలో గెలిచేందుకు శరీర దార్ఢ్యము మాత్రమే చాలదు. చోదక విద్యలో ప్రావీణ్యం ఉండాలి. బుద్ధికుశలత, సమయస్ఫూర్తి అందుకు తోడుకావాలి. గిత్తలను అలసిపోకుండా అదలించే నేర్పరితనము ఉండాలి. ఎద్దులయొక్క గుణాన్ని, గమనానికి అనుకూలంగా వాటిని ఉత్సాహపరచడాన్ని తెలిసి వుండాలి. ఎక్కడ కాలుతగిలిస్తే అది ఏ విధమైన పరుగును అందుకోగలదు? అను విషయం కూడ పందెగానికి బాగా తెలిసి ఉండాలి. విజయాన్ని సాధించడానికిఇవన్నీ అవసరం."

"పోండి నాన్నా! ఇవన్నీ బావకు తెలియవంటావా! మీరేమైనా చెప్పండి. రేపటి పందెంలో గెలుపు బావదే."

"నిజమే కావచ్చు. నీ విశ్వాసం ఎందుకు రిక్త అవుతుంది. విజయం మీ బావకే లభిస్తుంది. గిత్తలను శ్రీముఖశాతవాహనులకు నీతోగూడ కానుకగా ఇస్తాను." నీతోగూడ అనే మాటను మనస్సులోనే అనుకున్నాడు.

ఇంతలో బాలనాగి అక్కడకు వచ్చింది.

"ప్రభూ! హిమబిందుకుమారిని ముక్తావళీదేవి తీసుకరమ్మంది" అంది.

"శుభం. హిమా! మీ ముత్తవ్వ నిన్ను రమ్మంటూందట తల్లీ. వెళ్లు. మీ అమ్మ చనిపోయి నేటికి మూడుసంవత్సరాలు. అప్పటి నుండి కృష్ణాతీరమందుగల మహాఖేలనాస్థలమునకు అనతిదూరమున ఉన్న మనమందిరము కళావిహీనంగా ఉంది. రేపు జరుగనున్న గిత్తల పందెములను అక్కడినుంచే తిలకించాలిగదా? ఆ మందిరానికి వెళ్ళితే మీ అమ్మ గుర్తుకు వస్తుంది అని మూడేండ్లుగా అక్కడికి వెళ్ళుటలేదు. నేను అక్కడికే వెళ్లుచున్నాను. మీ ముత్తవ్వను, మీ మేనత్త అమృతలతను తీసుకొని అక్కడికి రా. అందరము కలిసి ఆ మందిరాన్ని శోభాయమానంగా తీర్చిదిద్దుతాము."

"సరే నాన్నా! నాకు ఏదో బెంగగా వుంది."

"పిచ్చి తల్లీ! సప్తసముద్రాలకు అవతల కూడ రెపరెపలాడే ఓడ తెరచాపలుగల చారుగుప్తుని తనయకు బెంగ ఎందుకు? మహారాజుకు ప్రీతిపాత్రుడై ఆంధ్రమహాసామ్రాజ్య విస్తృతికి నిరంతరం మూలస్తంభంగా వున్న ఈ చారుగుప్తుని తనయకా బెంగ? నీవు కావాలని అడగాలేగానీ ఆదిశేషునిఫణినున్న మణినిగూడ తృటికాలంలో తీసుకరాగల సమర్థుడు నీ తండ్రి అనేమాట మరచి పోయావా తల్లీ! బెంగ పెట్టుకోక సంతోషంగా ఉండు. నీసుఖము, నీసౌభాగ్యము, నీయశోవిభవము ఇవే నాకు కావాల్సినవి తల్లీ! సర్వకాల సర్వావస్థలలో నా భావన. నా ఆశ అంతా నీవేనమ్మా! ఈ గుండెలపై పెట్టుకొని పెంచుకొన్న నా వరాలతల్లికి, నా ముద్దులకూతురుకి ఏలోటూ రానివ్వనమ్మా" – అంటూ సాగనంపాడు చారుగుప్తుడు.

హిమబిందు మాటలు విన్న చారుగుప్తుడు తృటికాలము ఆలోచించాడు. సమవర్తిని ఆమె పొగడడంలో ఆమె మనస్సుకూడ అందుకు ఆకర్షితమైందా? అనే అనుమానం ఆయనకు కలిగింది. అదే జరిగితే, ఆయన ఆశలు పూర్తిగా వ్యర్థమైనట్లే. తనబిడ్డ ఈ విశాలఆంధ్ర మహాసామ్రాజ్యానికి పట్టపురాణి కావాలి. తెలుగునేల భూమి నలుచెఱగులా విస్తరించి మగధకు ఆవలకూడ ఎల్లలను ఏర్పరచుకోవాలి. తనబిడ్డ ఆంధ్రమహాసమ్రాట్టుకు ఇల్లాలు. తాను సర్వవర్తకలోక సార్వభౌముడు. ఇది ఆయన ఆలోచన.

సమవర్తి మహావీరుడే. సందేహం లేదు. మహారాజవంశమువాడే. కానీ మహారాజు కాలేడు. అందులో బుద్ధదేవుని పాదస్పర్శతో పునీతమై, వేదమతాన్ని, బౌద్ధమతాన్ని సమంగా పోషించే, ఐతరేయబ్రాహ్మణ మందుగూడ ప్రసక్తిగల ఈ ఆంధ్రభూమికి, విశాలతెలుగురాజ్యానికి మహారాజు కాలేడు. నా బిడ్డ మహారాణి కావాలంటే శ్రీముఖ శాతవాహనునికోడలు కావాలి. చక్రవర్తి సరసన అర్ధసింహాసన మెక్కగల అర్హతను గడించిన తనకు ఇది ఒక లెక్కా? అనేది ఆయన ఆలోచన. అందుకే ఆయన తపస్సు. తన తపస్సు ఫలించాలంటే - తన కోరిక నెరవేరాలంటే - తన కలలు పండాలంటే హిమబిందుకుమారి సమవర్తికి దూరంగా ఉండాలి.

మహాఖేలనాస్థలమంతా పాలసముద్రంవలె కనిపిస్తూ వుంది. దాన్యకటకనగరానికి పదిక్రోసులదూరంలో కృష్ణానదిఒడ్డున ఆ స్థలముంది. మల్లయుద్ధ క్రీడలు, అస్త్రవిద్యా ప్రదర్శనలు అన్నీ అక్కడే జరుగుతాయి. శాతవాహనసార్వభౌములు అందుకు వీలుగా సువిశాల మైన మైదానములో ఆ స్థలాన్ని ఏర్పాటు చేశారు. సార్వభౌములు అక్కడ జరిగే ప్రదర్శనను, ఎడ్లపందెములను తిలకించుటకు వీలుగా ఒక మందిరం ఆ ఆటస్థలమధ్యలో నిర్మించబడి ఉంది. ఆ మందిరానికి కొంతదూరంలో గాంధారశిల్పశోభితంగా చారుగుప్తుని "క్రీడాదర్శన మందిరము" ఉంది.

కళింగ, మగధ, అవంతి, ఉజ్జయిని, సౌరాష్ట్ర మొదలగు దేశాలనుండి ఆయా రాజుల తరపున పందెములో పాల్గొనేందుకు గిత్తలజతలు వచ్చాయి. ఏరి కోరి ఉత్సాహము, పట్టుదలగల యువకులను వారా శకటాలకు చోదకులుగా పంపారు. ధాన్యకటకము నుండి సమవర్తి, సువర్ణశ్రీ పాల్గొన్నారు.

పందెము ప్రారంభమైంది. పందెగాళ్ళు అంతా పోటుమగలే. అయితే ఎడ్లపందెములో ఆంధ్రులదే ఎప్పుడూ పైచేయి. ఎడ్లపందెములంటే ఆంధ్రులకు అమితప్రీతి.

మగధాధిపతి సుశర్మకాణ్వాయనుడు ఈ మారు మరింత పట్టుదలతో, పందెంలో పాల్గొనేందుకు తన తరపున ఒక మహాచోదకవిద్యా ప్రవీణున్ని పంపాడు. ఈ విధంగానైనా ఆంధ్రరాజులకన్నా తనదే పైచేయి అనుపించుకోవాలి అని.

గిత్తలు అన్నీకూడ జవసత్వాలు గలిగి పరుగులు తీస్తున్నాయి. ఒకప్పుడు మాగధికుడు, మరొక్కప్పుడు అవంతీవీరుడు, మరొక్కసారి కాశీవారు అగ్రగాములగు చున్నారు. ఉన్నట్లుండి వారు వెనుక బడుచున్నారు. మరియొకరెవరో ముందుకు దూసుకవస్తున్నారు.

సమవర్తి, సువర్ణశ్రీ మాత్రము నిదానంగా నిబ్బరంగా ఎద్దులను తోలుచూ, వేగాన్ని క్రమ క్రమంగా పెంచుచూ ఉన్నారు.

పందెము పదినిముషాల్లో ముగుస్తుంది. చూచేవారంతా ఆశ్చర్యపోయారు. ఎట్లువచ్చారో సమవర్తి, సువర్ణశ్రీలు అందరికంటే ముందున్నారు. మిగతావారంతా వెనుకబడిపోయారు. కొన్ని గిత్తలు సొమ్మసిల్లిపడిపోయాయి. మరికొన్ని చోదకుల మాటలను వినకుండా ప్రక్కకు పరుగులు తీశాయి.

ఇప్పుడు సమవర్తి, సువర్ణశ్రీలు ఒకరినిదాటి ఒకరు ముందుకు వెళ్లాలని ప్రయత్నిస్తూ ఉన్నారు. వారిమధ్య పెద్ద తేడాలేదు. చారుగుప్తునికి విజయం అనుమానాస్పదంగా తోచింది. హిమబిందుముఖాన్ని తిలకించాడు. సమవర్తి వెనుకబడినప్పుడల్లా ఆమె ముఖం వివర్ణమౌచూ వుంది. సమవర్తి ముందుకు వెళ్లినపుడు వికసిస్తూ ఉంది. అదిచూచిన చారుగుప్తునిగుండెల్లో గుబులు పుట్టుక వస్తూంది.

చివరకు విజయము సువర్ణశ్రీకే లభించింది. శ్రీముఖశాతవాహన మహాప్రభువు ఆ వీరకుమారుని వేదికపైకి పిలిచి అభినందించాడు. "ఆంధ్రులకీర్తిని నిలబెట్టావు కుమారా!" అంటూ ఉగ్గడించి పుష్పమాలాలంకృతుని గావించి, రత్నఖచితనిశితకరవాలాన్ని బహూకరించాడు విప్రులు వేదాశీస్సులు పలికి అక్షతలు చల్లారు.

చారుగుప్తుడు ఒక బంగారుపెట్టెను ఆ బాలునికి బహూకృతిగా ఇచ్చాడు. అందులో "వినయపిటకము" అను బౌద్ధమతగ్రంథము ఉంది.

రాకుమారి, మంత్రి, సామంతదండనాథుల కుమార్తెలు, హిమబిందు, నాగబంధునిక మొదలగు ఇరువది మంది కన్నియలు సుమర్ణశ్రీచుట్టూ చేరి "విజయము" అను నాట్యం చేశారు.

హిమబిందు ఆ విజయలక్ష్మీధవుని ఆపాదమస్తకం పరిశీలనగా చూచింది. ఆమె మనస్సులో ఏదో కమ్మనిభావన మెదలింది.

సువర్ణశ్రీ కూడ హిమబిందుకుమారిని చూచాడు.

హీనయాన, మహాయాన శాఖలుగా విడిపోయిన బౌద్ధమతంలోని శాఖల్లో చారుగుప్తుని కాలమునాటికి మహాయానము ఆంధ్రదేశములో ఉచ్ఛస్థితిలో ఉంది. మహాయానములోని మాధ్యమికవాదం నాగార్జునాచార్యుల కృషి ఫలితంగా ప్రజల్లో పాతుకపోయింది. ఆయన శిష్యులు మహాయానబౌద్ధమతాన్ని ఉద్ధృతంగా ప్రచారం చేస్తున్నారు.

మతము అనే శృంఖలాలకు తగుల్కొని మతభావాలకు మాత్రమే పరిమితము కాకుండ శాస్త్రరంగముకూడ ఎంతో ముందుకు పోయింది. సూక్ష్మాతిసూక్ష్మమైన శస్త్రచికిత్సలుకూడ వైద్యశాస్త్రంలో చోటు చేసుకున్నాయి. వింధ్యకు దక్షిణానగల రాజులందరు బౌద్ధమతాన్ని స్వీకరించారు. ప్రజలంతా బౌద్ధమతాభిమానులేకాక బౌద్ధమతావలంబులై బుద్ధుని జాడల్లో నడుస్తున్నారు. ఆంధ్రదేశములో ఎక్కడ చూచినా ఆరామాలు ఏర్పడి శ్రమణకులకు ఆవాసాలుగా మారిపోయాయి.

దేవుడు ఉన్నాడా? లేడా? అనేది ముఖ్యమైందికాదు. ప్రస్తుతానికి ఆ చర్చ అవసరమైందికాదు. మానవులంతా జీవకారుణ్యాన్ని కలిగి ఉండాలి. దుఃఖాలన్నింటికీ మూలము కోరికలు కలిగి ఉండడమే. ఆ కోరికలు నశించనంతవరకు మనిషికి సుఖం ఉండదు. ప్రతి విషయాన్ని మనిషి పరిశీలించి అనుసరించాలి. గ్రుడ్డిగా ఆచరించరాదు. ఏదో గొప్పవాడు చెప్పినాడుకదా అనీ, గొప్పకులంలో పుట్టినవారు చెప్పినారు అనీ భావించి ఆచరించరాదు. ప్రపంచములోని మానవులంతా సమానమే. శ్రమణకులు బౌద్ధబిక్షువులు. వారిలో కొందరు ఎక్కువ, మరికొందరు తక్కువ అనుటకు ఆస్కారములేదు. ఇవి బుద్ధుని బోధనలు.

బుద్ధుని ప్రచారము "బహుజనహితాయ, బహుజనసుఖాయ" అను నీతివాక్యానికి కట్టుబడి నడిచింది.

"బుద్ధం శరణం గచ్ఛామి", "ధర్మం శరణం గచ్ఛామి", "సంఘం శరణం గచ్ఛామి" అను త్రిపీటకాలు ఎక్కడ చూచినా వినిపిస్తున్నాయి.

బుద్ధుని జీవకారుణ్యసిద్ధాంతం, ఆయనలోని సర్వమానవ సమానత్వం, కులమతాలకు అతీతంగా సాగిన ఆయన ప్రచారం అప్పటి ప్రజలను బాగా ఆకర్షించాయి.

రాజులు, రారాజులు, కోట్లకు పడగలెత్తిన వైశ్యులు చివరకు బ్రాహ్మణులుకూడ నాగార్జునశిష్యుల బోధలకు, ప్రభావితులై ఆ మతాన్ని స్వీకరించారు.

సామాన్యజనులను బౌద్ధమతము మరింతగా ఆకర్షించింది.

పరాకాష్ఠకు చేరుకొన్న అప్పటి బౌద్ధమత విజృంభణకు ఆర్షమతమైన వేదమతము తట్టుకోలేక పోతూంది.

అమృతపాదులు, మొదలగు బౌద్ధమతపండితులు బౌద్ధమత గ్రంథాలను సులభశైలిలో వ్రాసి ప్రజలకు మరింతచేరువగా ఆ మతాన్ని తీసుకపోయారు.

అప్పటి ఆంధ్రరాజైన శ్రీముఖశాతవాహనసార్వభౌములు ప్రజాను రంజకముగా పరిపాలనను సాగిస్తూ, బౌద్ధమతానికి అండగా నిలిచారు. అయితే ఆయన వేదమతాన్ని ద్వేషించలేదు. వేదమత ప్రచారకులను, ఆచార్యులను నిరుత్సాహపరచలేదు. బౌద్ధమతావలంబకులు కమ్మని ప్రజలను నిర్బంధించలేదు.

"దేవుడు ఉన్నాడా? లేడా? అను ప్రశ్న అప్రస్తుతమైంది. కుల మతాలు పనికిరావు." అన్న బుద్ధునిబోధనలు వేదమతం వారికి నచ్చలేదు. అందువలన వారు బుద్ధుని నాస్తికుడుగా భావించారు. వేదములకు ప్రాధాన్యమునీయక పోవడంకూడ వారికి ఆగ్రహం కలిగించింది. "బౌద్ధమతము అనార్యమతమనీ, పాషండమతమనీ, అది దేశములో ఆస్తికతను నాశనం చేస్తున్నదనీ" వారు భావించారు. కుల మతాలకు ప్రాముఖ్యమీయని బుద్ధుని శిష్యులవలన వర్ణాశ్రమా చారవ్యవస్థ నిర్మూలనమగుచున్నదని భావించిన వారంతా బౌద్ధమత వ్యాప్తిని నిరోధించాలని తీవ్రప్రయత్నాలు ప్రారంభించారు.

అప్పుడు వైదికమతము మగధలో ఉచ్ఛదశలో ఉంది. మగధ రాజైన సుశర్మకాణ్వాయనుడు వేదమత ఉద్ధరణకొరకు యత్నములు ఆరంభించాడు. తన ప్రయత్నానికి సహాయపడే వారికి అండదండగా నిలుస్తానన్నాడు.

బౌద్ధమతవిజృంభణను అణచుటతోబాటు తిరిగి వేదమతాన్ని, ప్రతిష్ఠించాలన్న వారంతా మగధలో సమావేశమయ్యారు. వేదములు, వేదాంగములు, ఉపనిషత్తులు, జ్యోతిషాది వివిధ శాస్త్రాలను క్షుణ్ణంగా చదివి మంత్రశాస్త్రంలో కూడ ప్రావీణ్యమును గడించిన ఉద్దండులైన మహాపండితులెందరో ఆ సమావేశానికి హాజరయ్యారు.

ఎన్నోచర్చలు జరిగాయి. ఎంతోమంది మాట్లాడారు. ఆవేదనను వెలిబుచ్చారు. వేదమత పునరుద్ధరణకు శపథం చేశారు. స్థూలతిష్యుడు అందుకు అగ్రగామిగా నిలిచాడు.

వారము తిరుగకముందే స్థూలతిష్యుడు, తన శిష్యగణంతో ప్రయాణం సాగించాడు. మార్గమధ్యములో ఉన్న అనేకమంది సామంతులను, రాజులను సందర్శిస్తూ ధాన్యకటకాన్ని చేరుకొన్నాడు. ఆ నగరానికి సుమారు రెండు క్రోసులదూరంలో అశ్రమాన్ని నిర్మించు కొన్నాడు.

స్థూలతిష్యుడు ధాన్యకటకాన్ని చేరుకొన్న కొన్ని దినములకే శ్రీముఖ శాతవాహనుని చిన్నకొడుకు మంజుశ్రీ ఉన్నట్లుండి మాయమయ్యాడు.

"సువర్ణా"

ఉలికిపడి తల ఎత్తిచూచాడు శిల్పాన్ని చెక్కుటలో నిమగ్నుడై ఉన్న సువర్ణశ్రీ. ఎదురుగా ధర్మనంది. లేచి, నమస్కరించాడు సువర్ణశ్రీ. "చిరంజీవ" అని ఆశీర్వదించాడు ధర్మనంది.

"ఎంతసేపైంది నాన్నా! మీరువచ్చి".

"చాలాసేపైంది. నేను వచ్చునప్పటికి నీవు శిల్పమును చెక్కుటలో నిమగ్నుడవై ఉన్నావు. నీ ఏకాగ్రతకు భంగము కలిగించుటకు ఇష్టములేక ఈ నీ శిల్పమందిరాన్నంతా తిరిగి వచ్చాను."

"నిజమా? తండ్రీ!"

"అవును చిరంజీవీ! నీకుగల వీరవిద్యలమీది ఆసక్తినిచూచి శిల్పమును చెక్కుటలో నీ మనస్సు నిలువదేమో? అని భయపడ్డాను. నీ ఉలితో రూపాన్ని దిద్దుకొన్న ఈ రమణీయ శిలామూర్తులను చూచి ఆ భయాన్ని పోగొట్టుకొంటున్నాను. అటుచూడు. ఆ బోధివృక్షము క్రింద నిలబడి బౌద్ధ ధర్మాలను ప్రవచిస్తున్న బుద్ధ భగవానునిరూపాన్ని ఎంతమనోజ్ఞంగా భావపూర్ణంగా మలచావో?"

"ధన్యోస్మి తండ్రీ!"

"కుమారా! శకటవేగ పరీక్షనాడు నీలోగల ఉత్సాహాన్ని, వీరవిద్యలను అభ్యసించడములో నీవు చూపిస్తున్న శ్రద్ధను గమనించి నప్పటినుండి నాలో శిల్పవిద్యలో నీవు వెనుకబడుచున్నావనే భావన కలిగింది".

"ఎందుకునాన్నా!"

"కుమారా! శిల్పాలను చెక్కడము అనేది మన స్వధర్మము. ఇతరములు ఏవైనా అవి పరధర్మములు. పరధర్మములు ఎంత లెస్సగా అనుష్ఠింపబడినవి అయినా స్వధర్మాన్ని మించునవికావు. తథాగతుని బోధలను కవులు కమ్మగా గ్రంథస్థంచేస్తే, శిల్పులు వాటికి మనోహరమైనరూపాన్ని కలిగించి పామరజనకోటికి సులభంగా అర్థ మయ్యేలా చేస్తారు.

"తండ్రీ! ఈ మీ మాటలు నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి"

"ఎందుకూ?"

"ఎందుకా! మీరు కేవలము శిల్పవిద్యకే పరిమితమైనట్లు, వీరవిద్యా వినోదములలో, యుద్ధాలలో పాల్గొననట్లు మాట్లాడుచున్నారు. అభయ మహారాజుతో మీరు యుద్ధముచేసినవిషయము నేనెఱుగనను కొంటిరా?"

"నా ఆవేదన, అదికాదు కుమారా! వీరవిద్యలకు, శ్రమకోర్చే శరీరము. చిత్తస్థయిర్యము, బుద్ధికుశలత, వ్యూహనిర్మాణరహస్య పరిజ్ఞానం కావాలి. శిల్పవిద్యకు సాహిత్యపరిశ్రమ, శిల్పశాస్త్రపరిశీలన, అందులో ఇమిడియున్న సూక్ష్మాతిసూక్ష్మములైన మెలకువలు తెలిసి ఉండాలి. సర్వసాధారణంగా శరీరశ్రమకోర్చగలిగే వారికి సునిశితమైన విద్యలయెడ లక్ష్యము కుదరదు. అందుకనే అలా భావించాను. ఈనాడు ఈ మందిరములో నీ శిల్పవిన్యాసములో రమ్యాతిరమ్యంగా రూపుదిద్దుకొన్న నీ శిల్పసరస్వతిని కళ్ళారా చూచి నా మనస్సులో ఆ లోటును పూర్తి చేసుకొన్నాను. లలితకళల్లో "శిల్పము" కూడ ఒకటన్నది మరచిపోకూడదు. ఆకళాసరస్వతి నా తరువాతకూడ నీచే ఆరాధించబడాలి. ఉత్తమభావుకుడవై, ఉద్రేకాలకు లోనుగాక, మహెూన్నతశిల్పకళాసరస్వతికి నీరాజనము పట్టు" - అని వెళ్ళిపోయాడు.

శక్తిమతి, ధర్మనందుల ఏకైక పుత్రుడు సువర్ణశ్రీ. నాగబంధునిక, సిద్ధార్థనిక సువర్ణశ్రీ చెల్లెంద్రు.

సువర్ణశ్రీ సిద్ధహస్తుడైన శిల్పి మాత్రమేకాదు. శిల్పముతోబాటు చిత్రలేఖనాన్నిగూడ చక్కగా అభ్యసించాడు. కుంచె విదిలించినంతనే సుందరమైన చిత్రాలు సృష్టింపబడుతాయి. శిల్పవిద్యను, చిత్రకళను అభ్యసిస్తూనే సోమదత్తులవారివద్ద బాణప్రయోగ విధానాన్ని, ఖడ్గచాలనా నైపుణ్యాన్ని, వ్యూహనిర్మాణాన్ని, శత్రువులు వేసే ఎత్తుగడలు, గుఱ్ఱపు స్వారి నేర్చుకొన్నాడు. మహారాజుల జన్మదినోత్సవ శుభసమయాల్లో జరిగే పోటీల్లో పాల్గొనుటకని శకటవేగవిధానములో ప్రావీణ్యమును పొందాడు.

సుతిమెత్తనైన అతని కరపల్లవము నుండి ఉలి చకాచకా నడుస్తుంది. సుత్తె జాగ్రత్తగా మసలుకొంటుంది. భావానికి అనుకూలంగా ఉలిని నడిపించి ఎటువంటి శిల్పాన్నైనా సుందరంగా మలచగల నేర్పరి. ఇరవైసంవత్సరాల వయస్సులో ఉన్నవాడు. కోలముఖము. ఎఱ్ఱని పెదవులు. కాంతిసహితములైన కన్నులు. దీర్ఘములైన బాహువులు. విశాలమైన వక్షము. చిరునవ్వులు చిందే ఆ నవయువకుని మోమును చూచినవారు ఆకర్షితులు కాకపోరు.

శకటవేగపరీక్షలో విజయలక్ష్మీధవుడైన సువర్ణశ్రీని చూచినప్పటి నుండి హిమబిందు హృదయములో ప్రణయభావనలు అంకురించాయి. ఆమె లేతహృదయమున అతని సుందరరూపము మూర్తికట్టింది. ఆమెలో కలిగిన ప్రణయవాంఛ దినదిన ప్రవర్ధమాన మౌతూ ఉంది.

సువర్ణశ్రీ మనస్సులోకూడ హిమబిందు కుమారి రూపము మెదల్తూనే ఉంటుంది. అమె ముఖచంద్ర దర్శనమునముకై అతని మనస్సు వర్షాగమనానికి ఎదురుచూచే చాతకపక్షిలా ఆరాటపడుచూ ఉంది.

"హిమబిందు" అతిలోక సౌందర్యవతి. తెల్లని ఛాయ. గుండ్రని మోము. సొగసైన కనుబొమ్మలు. నల్లని కన్నులు. నాతితీక్షణములైన దృక్కులు. చిరుగుంటలు గల చికిలి గుబ్బలు. తెల్లని పల్వరుస కలిగి మధుర ప్రణయారాధకులను క్షణమాత్రమున ఆకర్షించగల మనోజ్ఞమైన రూపము గలది.

కృష్ణానదీతీరానగల కులపతి అమృతపాదార్హతుల ఆశ్రమము నానుకొని ఆయన పర్యవేక్షణలో నడుపబడే బాలికలపాఠశాల ఉన్నది. దానికి చుట్టూ ఎత్తైన గోడలు. సర్వవిద్యాపారంగతులు, సర్వశాస్త్ర కోవిదులు, బుద్ధభగవానునిబోధనలు చక్కగా గ్రహించినవారు అందులో అధ్యాపకులు. హిమబిందు ఆ పాఠశాలలోనే విద్యలను అభ్యసిస్తూ ఉంది. వదాన్యశేఖరుడైన చారుగుప్తుడు, ఆ పాఠశాలకు కావలసిన అన్ని వసతులు తనధనముతో ఏర్పరచాడు. ఆమెతోబాటు నాగ బంధునిక, సిద్ధార్థనికకూడ చదువుకొంటున్నారు.

నాగబంధునిక ప్రకృతి స్త్రీ సహజమైన గుణాలకు చాలాదూరము. పురుషసహజమగు గుణాలకు అతిసన్నిహితము. ఆమె తన అన్న సువర్ణశ్రీతో కలిసి యుద్ధవిద్యలు నేర్చుకొంటూ ఉంది. గుఱ్ఱపు స్వారిని కూడ నేర్చుకొంది. యుద్ధవిద్యలందు ఆమెకుగల ఆసక్తిని చూచి సువర్ణశ్రీ "నీవు నాకు తమ్ముడివై పుట్టాల్సినదానవు" అనేవాడు. సిద్ధార్థనిక మితభాషి.

---

కౌశికుడు ప్రథమార్యఋషి. దీపకర్ణి ఆ కౌశికగోత్రోద్భవుడు. ఆయన కుమారుడు శాతవాహనుడు. ఆయన తన పేర శాతవాహన సామ్రాజ్యాన్ని శ్రీకాకుళం రాజధానిగా స్థాపించాడు.

రాను, రాను కౌశికులలో రెండు వంశాలు ఎక్కువ ప్రాధాన్యతను పొందాయి. అందులో ఒకటి శ్రీకాకుళాన్ని వీడి గోదావరి, కృష్ణా పరీవాహక ప్రదేశాల వెంబడి సంచరిస్తూ, కృష్ణవేణీనదికి ఎగువన శ్రీపర్వత ప్రాంతాలకు చేరుకొంది.

అప్పటికి ఆ ప్రాంతాలు దట్టమైన అడవులతో నిండి ఉన్నాయి. ఫలసమృద్ధమైనవృక్షాలతోను, అమిత సారవంతమైన భూప్రదేశముతోను ఆ ప్రాంతం ఉండేది. బంగారుగనులు, రత్నాలగనులు కూడ ఆ ప్రాంతంలో ఉన్నట్లుగా భావించేవారు. ఆటవిక నాయకుల అధీనంలో ఆ ప్రాంతం ఉండేది.

బుద్ధికుశలురైన కౌశికులలోని ఈ రెండవ తెగవారు ఆటవికులను ఓడించి ఆ ప్రాంతాన్ని తమ అధీనములో తీసుకొని అచ్చటే స్థిరపడ్డాడు. వారికి తమ ఆర్యసంప్రదాయాలనుకూడ నేర్పించారు. భూగర్భరత్న రాసులతోను, మహాసారవంతమైన భూమితోను ఉన్నందున ఆ ప్రాంతాన్ని "ధనికదేశము" అనికూడ పిలిచేవారు. ఆ దేశములో స్థిరపడిన తర్వాత వారు "ధనికులు" అనికూడ పిలువబడ్డారు.

ఫలసమృద్ధమైన అడవిని ఆశ్రయించి జీవిస్తున్న కారణంగా వారు "అడవి" వారుగాకూడ పిలువబడ్డారు.

శాతవాహనుల నుండి విడివడినందుకు గుర్తుగా వీరు తమ వంశఋషి దర్శించిన గాయత్రీదేవి మంత్రమునకు సంబంధించిన సంఖ్యాయనస గోత్రాన్ని స్వీకరించి, నాటినుండి "సాంఖ్యాయను"లుగా పిలువబడ్డారు.

ఆ సాంఖ్యాయనులు అక్కడ ఒకనగరాన్ని నిర్మించి "ధనక పట్టణము" అని పేరు పెట్టారు.

కలక్రమేణా శాతవాహనులు విజృంభించి, వారి ప్రథమాంధ్ర ముఖ్య పట్టణమైన శ్రీకాకుళాన్ని వదలి క్రమేణా విస్తరిస్తూ సాంఖ్యాయనులు నివసిస్తున్న శ్రీపర్వతప్రాంతాలు చేరుకొన్నారు. సాంఖ్యాయనుల కోరిక మేరకు ధనకటక నగరాన్ని రాజధానిగా చేసుకొని సామ్రాజ్య విస్తరణకు పూనుకొన్నారు. ఆనాటి "ధనకటకనగరము" ధాన్యకటకంగా మారి ఆంధ్రశాతవాహన సామ్రాజ్యానికి ముఖ్యపట్టణమై చరిత్రలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకొంది.

శాతవాహనులు విజృంభిస్తున్నకొద్దీ సాంఖ్యాయనులు తగ్గిపోసాగారు. అందువలన తరువాత కాలమున సాంఖ్యాయనులు శాతవాహన సామ్రాజ్యానికి సామంతులయ్యారు. యజ్ఞశ్రీశాతకర్ణి కాలానికి సాంఖ్యాయనులు శాతవాహనసామ్రాజ్యానికి "ప్రధానరక్షకు"లన్న పేరును సంపాదించారు.

ఆ శాతవాహనవంశీయుడైన అభయబాహుశాతవాహనునికి, ఆయన భార్య వాశిష్ఠీదేవికి బౌద్ధశకము 426వ వర్షమున శ్రీముఖ శాతవాహనుడు జన్మించాడు.

బౌద్ధశకము 453వ సంవత్సరమున శ్రీముఖుడు ధాన్యకటక నగరమున శాతవాహనసామ్రాజ్యసింహపీఠమును అధిరోహించాడు.

అప్పటికి మగధ, పుళిందము, శాతవాహనుల వశము కాలేదు. భోజులుగూడ స్వతంత్రంగానే ఉన్నారు. అదనుచూచి శాతవాహన సామ్రాజ్యాన్ని తమదిగా చేసుకోవాలనికూడ వారు ఆలోచిస్తున్నారు.

మగధను అప్పుడు సుశర్మకాణ్వాయణుడు పాలిస్తున్నాడు.

రెడ్డి సామ్రాజ్యానికి అవచి తిప్పయ్యశ్రేష్ఠి వలె, శాతవాహన సామ్రాజ్యానికి వర్తకసార్వభౌముడగు చారుగుప్తుడు అన్నిటా ఏడుగడ. దేశభక్తి పరాయణుడు. ప్రభువుఎడ విశ్వాసముగల ఆ వర్తకచక్రవర్తి. "జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసి" అను ఆర్షవాక్యమునకు సాక్షాత్తూ సాక్షీభూతుడు. ఆయన ఆలోచన సర్వకాల సర్వావస్థలయందు శాతవాహనసామ్రాజ్య విస్తరణను గురించే.

స్థాలతిష్యుడు ధాన్యకటకమును చేరుకొన్న రోజున మాయమైన రాజపుత్రుడు మంజుశ్రీ జాడ ఇంకా తెలియలేదు.

శాతవాహనసామ్రాజ్యచారశాఖాధ్యక్షుడు శుకభాణుడు.

శుకభాణుడు, మహా మేధావి. ఆయన నేతృత్వమునగల చారగణము కూడ మహాప్రతిభగలదే. వారు ఎంతప్రయత్నించినా రాకుమారునిజాడ తెలుసుకోలేక పోతున్నారు.

రాణి పుత్రవియోగ దుఃఖముతో కుమిలిపోతూ ఉంది.

రాజు పైకి గంభీరంగా కన్పిస్తున్నా లోలోన బాధపడ్తూనే ఉన్నాడు.

ఆలోచించేకొద్దీ అది రాజకీయ కుట్రగా కన్పిస్తూ ఉంది. అయితే ఆ కుట్రకు ప్రధానకారకులెవరో తెలియుటలేదు.

కార్తాంతికులు మంజుశ్రీ రాకుమారుడు క్షేమంగా ఉన్నాడని, క్షేమంగా ఇంటికి వస్తాడని రాజుకు, రాణికి చెప్తూ ధైర్యాన్ని కలిగిస్తూ ఉన్నారు.

తనువులు వేరైనా ప్రాణాలొక్కటే నన్నట్లు మసలుకొంటున్నందున చారుగుప్తునకు కూడ మంజుశ్రీరాకుమారుడు మాయంకావడం మనస్సును క్షోభపెట్తూనే ఉంది.

ఒకనాడు శ్రీముఖుడు సముచిత పరివారుడై స్థాలతిష్యుని ఆశ్రమానికి వెళ్ళాడు. అప్పుడు మహర్షి స్థాలతిష్యుడు పూజామందిరమునుండి విశ్రాంతిమందిరానికి వస్తూ ఉన్నాడు.

రాజాగమనవార్తను పరిచారకుల వలన విని ఎదురేగి స్వాగతం పలికి లోపలికి తీసుకవెళ్ళాడు.

రాజు భక్తిపూర్వకముగా ప్రణమిల్లాడు.

రాజు ఆయన వసతులను గురించి, అడిగి తెలుసుకొన్నాడు.

ఆంధ్రరాజులు బౌద్ధమతాన్నిస్వీకరించి వేదమతోద్ధరణకు కృషి

చేయలేదన్న బాధను స్థూలతిష్యుడు మాటల్లో వ్యక్తపరిచాడు. నిశితంగా పరిశీలిస్తే ఆయన అంతరాంతరాల నిండా ఏదో బాధ, క్రోధము గూడుకట్టుకొని ఉన్నదని రాజు గూడ గ్రహించగలిగాడు.

రాజువెంట మహామాత్యుడు అచీర్ణుడు, యువరాజు శ్రీకృష్ణ శాతవాహనుడు, సర్వసైన్యాధ్యక్షులు స్వైత్రుడు, చారగణాధ్యక్షులు శుకబాణుడు కూడ వెళ్ళారు. వారు ఆ ఆశ్రమ ప్రాంతాన్ని నిశితంగా పరీక్షించారు. వారికి ఎక్కడా అనుమానం కలుగలేదు.

తిరుగుముఖం పట్టినప్పుడు మహారాజు శ్రీముఖశాతవాహనుని వెంట వెళ్ళిన యువరాజు శ్రీకృష్ణశాతవాహనుడు స్థూలతిష్యునికి నమస్కరించాడు. స్థూలతిష్యుడు చిరంజీవ! అని అప్రయత్నంగా ఆశీర్వదించాడు. ఆయన ఆ తరువాత ఎంతగానో బాధపడ్డాడు. ఏ వ్యక్తినైతే తన శపథమునకు ఎరగా ఉంచుకొన్నాడో, అతన్నే ఆయన ఆశీర్వదించాడు. అయితే తన ఆశీస్సు వృధా కాదుగదా? అని తదుపరి చింతించాడు.



అది కార్తీక శుద్ధపక్షమందలి ఒకరోజు. శరదృతువు అప్పటికి సగందాటిపోయింది. కృష్ణలోనీటి పొంగుతగ్గుతూంది. వర్షాకాలపునాటి ఎఱ్ఱదనం కూడ పోయి తన సహజమైన నీలిమను సంతరించు కొంటూంది. తరుణభాస్కరుని కాంతులకు కృష్ణఒడ్డున గల ఇసుక బంగారువన్నెతో ప్రకాశిస్తూ ఉంది.

చెలికత్తె బాలనాగిని వెంటబెట్టుకొని హిమబిందు, సుమర్ణశ్రీ శిల్ప మందిరానికి వెళ్ళింది. అందలి శిల్పాలను ఒక్కొక్కదాన్నే చూస్తూ ముందుకు సాగింది.

ఒకచోట బోధివృక్షపునీడలో నిలబడి వున్న బుద్ధభగవానుడు కనిపించాడు. అత్యద్భుతమైన ఆ శిల్పనిర్మాణానికి అచ్చెరువు పడుచూ ఆ కారుణ్యమూర్తికి చేతులెత్తి నమస్కరించింది.

అటనుండి కదలి మరికొంతదూరము వెళ్లిన ఆమెకు ఇంకా తుది మెఱుగులు దిద్దుకోని ఒక సుందరయువతి విగ్రహం కన్పించింది. ఆ మూర్తిని ఎగా దిగా చూచిన ఆమెకు ఆ శిల్పమందలి యువతి తనేనని గ్రహించడానికి ఎంతోసేపు పట్టలేదు.

అమ్మా? ఇది నీ రూపమే ఉన్నట్లుంది కదూ! అంటూ ప్రశ్నించింది బాలనాగి.

కాదన్నట్లుగా ఆమె సమాధానము చెప్పి, ఆ మందిరమందలి మిగతా శిల్పములను చూస్తూ మందిరమంతా కలయజూచింది. ఆ సమయమున ఆమె కన్నులు సువర్ణశ్రీ కొరకు ఎదురుచూచాయి. కానీ సువర్ణశ్రీ అక్కడ కనిపించలేదు.

ఇంతలో, అక్కా! అక్కా! అంటూ నాగబంధునిక అక్కడికి వచ్చింది. ఆమెతో బాటు సిద్ధార్థనిక కూడా ఉంది.

అంత ఆ నలుగురు కలిసి గృహములకు వచ్చారు.

ఆనాటి మధ్యాహ్నం భోజనానంతరము సువర్ణశ్రీతో నాగబంధునిక అన్నా! ఈ రోజు "హిమబిందు" నీ శిల్పశాలకు వచ్చింది అని చెప్పింది.

స్థాలతిష్యుడు మహాపండితుడు. మహామేధావి. మహాజ్ఞాని. చతుర్వేదాలను, ఉపనిషత్తులను చదివినవాడు. మంత్రశాస్త్రమును సంపూర్ణంగా ఎరిగినవాడు. కఠోరదీక్షాపరాయణుడు.

ఆర్షధర్మమే స్వయంగా రూపమెత్తి వచ్చిందా? అనిపిస్తుంది ఆయన్ను చూస్తూంటే. బ్రహ్మతేజస్సు ముఖమునిండా తాండవమాడుచూ ఉంటుంది. చెవులకు మణికుండలాలు. చేత మంత్రదండము. కాళ్లకు పావుకోల్లు ధరించిన ఆజానుబాహువు.

ఆర్షధర్మమునకు అవంతలోపము కలిగినా సహించలేడు. హిందూ ధర్మము సనాతనమైంది. వేదప్రోక్తమైంది. ఆ వేదాలు సాక్షాత్తూ పరమేశ్వరుని ముఖం నుండి వచ్చాయి. ప్రపంచములో ఆర్షధర్మమునకు మించిన ధర్మములేదు. మానవుణ్ణి మహనీయుని చేసేశక్తి, పునర్జన్మలేని మోక్షసామ్రాజ్యానికి పట్టాభిషిక్తుని గావించే శక్తి ఈ ఆర్ష ధర్మమునకున్నది. ఎందరో మహర్షులు, ఎందరో మేధావులు ఈ ఆర్షధర్మ విశిష్టతను, దాని అవశ్యకతను పరిపరివిధాల ఉగ్గడించారు. ప్రవృత్తి, నివృత్తి మార్గాలను సమంగా చూడగలశక్తి ఆర్షమతమునకే ఉన్నది అని ఆయన భావన.

ఇప్పటి ఆంధ్రరాజులైన శాతవాహనులు బౌద్ధమతాన్ని అవలంబించి సనాతనమైన వేదమతానికి ద్రోహము చేస్తున్నారు. బౌద్ధమతము దేవుడు లేడంటుంది. దేవుడు లేడన్నది పాషండమతము. బౌద్ధమతాన్ని అవలంబించి శాతవాహనులు ఆంధ్రభూమికి అన్యాయం చేస్తున్నారు. ఈ భావనలు కలిగినప్పుడల్లా ఆయన ఉగ్రుడవుతాడు. చలించిపోతాడు. వచ్చేకోపాన్ని ఆపుకోలేక, ఆవేశాన్ని అణచుకోలేక ఆవేదనను చెందుతాడు. అందుకే ఆంధ్రభూమిలో తిరిగి వేదమతోద్ధరణ జరగాలి. ఈ పాషండ మతాన్ని ఈ గడ్డనుంచి పారద్రోలాలి. ఈ ఆశయముతోనే, ఈ ఏకైక ధ్యేయముతోనే ఆయన ధాన్యకటకాన్ని చేరాడు.

ధాన్యకటకానికి క్రోసు దూరమున, కృష్ణానది ఒడ్డుకు కొన్ని ధనువుల దూరమున తన ఆశ్రమాన్ని నిర్మించుకొన్నాడు. ఫలభరితములైన వృక్షములతోను, తరులతాగుల్మములతోను, పరిమళభరితములైన పుష్పవృక్షములతోను, ఆశ్రమం నిస్తులప్రశాంతతకు నిలయమై ఉంటూంది. అందునుండి నిరంతరం హోమధూమము గుబురు గుబురుగా వెలువడుచూ ఉంటుంది.

బౌద్ధమతవ్యాప్తికి బాధపడుచూ, వేదమతోద్ధరణకై ఆరాటపడే పలువురు రాజులు స్థూలతిష్యునికి ధనరూపమున సహాయపడుచూ, ఆయన సాధించదలచిన కార్యము నిర్విఘ్నముగా కొనసాగుటకు అజ్ఞాతంగా తోడ్పడుచూ ఉన్నారు.

ఆ ఆశ్రమము రెండు భాగాలుగా ఉంది. ఆ రెంటిని కలుపుతూ పెద్దవసారా ఉంది. స్థూలతిష్యుడు తన్ను చూడవచ్చిన వారికి అక్కడే దర్శనమిస్తాడు. అన్ని విషయాలను అక్కడే చర్చిస్తాడు.

అందులో మొదటిభాగములో ఆయన హోమాగ్ని క్రతువులు నెరవేర్చుతారు. నిత్యకర్మానుష్ఠానాలు అక్కడే నిర్వహిస్తాడు. అక్కడ అగ్ని ఎప్పుడు వెలుగుచూ ఉంటుంది. మంద్రమధురస్వరాలతో భూసురులు అక్కడ గాయత్ర్యాది మహామంత్రాలను, శ్రీసూక్త, పురుషసూక్తాలను వల్లిస్తూంటారు.

రెండవ భాగమున ఒక సుందరమందిరాన్ని నిర్మించాడు. దాని నానుకొని ఒక గది ఉంది. ఆ గదిగోడలకు చెదలు పెట్టిన పుట్టలు. వాటినిండా బుసలు కొట్టే పాములు. అందులో కొన్ని శ్వేతోరగాలు, మరికొన్ని కృష్ణోరగాలు.

ఆ సుందరమందిరములో అత్యద్భుత సౌందర్యవతి యగు నొకబాల. పసిడిశలాకవంటి శరీరచ్ఛాయ. పరిమళసహితమైన నాసిక. పౌర్ణమినాటి చంద్రునికన్న గుండ్రనిముఖము. నల్లని కురులు. ఎఱ్ఱని పెదవులు. తెల్లని పల్వరుస. విశాలములైన కన్నులు. సన్నని నడుము. ఆమె లోకాద్భుతసౌందర్యవతి. అక్కడ ఆమె పాములతో ఆడుకొంటూ ఉంది. పదహారేళ్ళునిండని ఆ కన్య ఒంటరిగా ఆ మందిరంలో ఉంటుంది. ప్రొద్దుపోనపుడు ఏ శ్వేతోరగినో, లేక ఏ కృష్ణ సర్పమునో పిలుస్తుంది. ఆమె వాటికి ముద్దు ముద్దుగా పేర్లుకూడ పెట్టుకొంది. ఆ పేర్లతోనే వాటిని పిలుస్తుంది. ఆమె పిలుపు వాటికి అత్యంత ఇష్టము. అవి పరుగు పరుగునవచ్చి ఆమెతనువున ఎగబ్రాకి, అచ్చటచ్చట నాల్కలతో స్పృజించి, ఆమె ఒడిలోకి వచ్చి విశ్రాంతి తీసుకుంటాయి.

పాములతో ఆడుకోవడం ఇష్టంలేనప్పుడు ఆమె ప్రక్కనున్న ఉద్యాన వనంలోకి వెళ్ళుతుంది. ఆ వనము చూచుటకు సుందరంగా ఉన్నా అందలి వృక్షములన్నీ మహావిషముగలవి. శృంగి, మదనభేరి, ముష్ఠి, విషక్షీర, విసబొద్ది మొదలగు వృక్షములు తన విషపత్రములు విచ్చి చూచువారలను ఆకర్షిస్తున్నాయి. ఆ సుందరవనవాటికలో మృత్యువు నృత్యం చేస్తూ ఉంటుంది.

స్థూలతిష్యుడు ఆ బాల ఆడుకొనుటకు ఆ కేళీ వనమధ్యమున ఒక సరస్సును నిర్మించాడు. దానిచుట్టూ చంద్రకాంతశిలావేదికలు నిర్మించాడు. రక రకములైన రంగులుగల శిలలను తెప్పించి దాని లోఅంచులకు కరిపించాడు. ఆ నీటిలో మహావిషములు కలిపాడు.

కేళీవనాంతరమునకు వెళ్ళి ఆ బాల తనవలువలను ఊడ్చి, ఒక తరువుకువేసి ఆ నీటిలో మునుగుతుంది. ఆ నీటిని పుక్కిట బట్టి ఉమ్మివేస్తూంటూంది. కొంతసేపు అనేక రకములైన జలక్రీడలతో ప్రొద్దుపుచ్చుతుంది. గట్టుకువచ్చి, వలువలు ధరిస్తుంది.

ఆ వనం ఏ విధంగా విషదిగ్ధము, మరణాంతకమో, ఆ బాల గూడ ప్రమాదకారే. ఆమె విడిచేగాలిగూడ ప్రాణికోటికి మృత్యుద్వారమే. స్థూలతిష్యుడు ఆ బాలను అలాపెంచాడు. గోరుముద్దలు తినిపించునపుడే అందులో నువ్వుగింజలో పదియవవంతు గరళాన్ని కలిపేవాడు. నూటిలో ముప్పై వంతు నాభినికలిపి పాలు త్రాగించేవాడు.

ఆ బాల మూడు సంవత్సరాల వయస్సులో ఉన్నపుడు నూగుగింజఎత్తు సౌరాష్ట్రాన్ని ఆమెచే తినిపించాడు. ఆమె పంచవర్షప్రాయములో ఉన్నప్పుడు ఆవగింజంత శాక్లికేయాన్ని మ్రింగించాడు. దారదమును, వత్సనాభాన్ని గూడ స్థూలతిష్యుడు ఆమెచే తినిపించాడు. ఆ బాలిక పంద్రెండేండ్ల వయస్సులో ఉన్నప్పుడుకాలకూట విషమునే ఆ బాలికచే తినిపించాడు. ఈ విధంగా ఆమె విషకన్య అయింది. ఆమెను స్పృశించినా, ఆమె విడిచే వాయువులు సోకినా మరణించక తప్పదు.

ఒకనాడు స్థూలతిష్యుడు మహేశ్వరునిపూజ ముగించి ఆ బాలిక ఉన్న గృహానికి వచ్చాడు. అప్పుడే ఆ బాల కేళీవనవాటిక నున్న సరస్సులో స్నానమాడి వచ్చి అగరు, సాంబ్రాణి పొగలతో కురుల తడిని ఆర్చుకుంటూ ఉంది.

"తాతయ్యా!" అంది ఆమె.

"ఏమమ్మా!" అంటూ పలికాడు అయన.

"ఈ రోజు వనాంతరమున ఒక పక్షి జంటను చూచాను. అవి ఏవో గున, గునలు ఆడుకుంటూ ఆనందముతో కేరింతలుకొట్టూ కనిపించాయి. దాన్ని ఏమంటారో చెప్పవూ?"

ఆ మాటలువిన్న స్థూలతిష్యుడు ఒక క్షణం నిర్ఘాంతపోయాడు. ఆమె భావనలో ఏదో కదలిక కలిగినట్లుగా భావించి కొంత చలించిపోయాడు. దాన్ని "ప్రేమ" అంటారు అని సమాధానమిచ్చాడు.

" 'ప్రేమ'. దాన్ని ప్రేమ అంటారా తాతయ్యా! అంటే ఏమిటో నేనెప్పుడు ఆమాట వినలేదే? చెప్పవూ!"

"ఒకజీవి మరియొక జీవిపై పెంచుకొనే మధురభావన. ఆ రెండింటి అంతరాంతరాలలో గూడుకట్టుకొని శాశ్వతముగా నిలచి పోయేదన్న మాట."

"అట్లనా! నన్ను ప్రేమించమంటారా?" అంటూ వెంటనే ఎవరిని ప్రేమించాలబ్బా అని, చెక్కిలి క్రింద చేయి పెట్టుకొంది.

ఆ మాటలు స్థూలతిష్యున్ని మరింతగా చలింపజేశాయి. ఇలా ఈ బాలిక లౌకిక విషయాలపై మనస్సును మళ్ళిస్తే తన లక్ష్యసాధనకు భంగము కలుగుతుందని అదిరిపోయాడు. అయినా అంతా ఈశ్వరేచ్ఛ అనుకొన్నాడు.

"ఆ సమయము త్వరలోనే వస్తుందమ్మా! ప్రేమిస్తావో? ఆటలాడు కుంటావో? ఏమి చేసుకుంటావో చూద్దాం" అన్నాడు.

"ఆటలా? ఎవరితో?"

"అతనితోనే. సమయం వచ్చినప్పుడు చెప్తాను." అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

ఆ బాలిక ఎవరోకాదు. స్థౌలతిష్యుని మనుమరాలు. ఆర్షధర్మ సముద్ధరణకై ఆయన చేస్తున్న మహాయజ్ఞములో తన మనుమరాలినే సమిధగా ఉపయోగిస్తున్నాడు. తానేమైనా సరే, తన కుటుంబము ఏమైనా సరే. ఆంధ్రదేశమున తిరిగి ఆర్షమత పునరుజ్జీవనము జరగాలి. పుణ్యప్రదమైన ఈ భూమిపై పాషండమతము సమూలంగా నిర్మూలింపబడాలి. తన ఆరాధ్యదైవమైన పరమేశ్వరుని ప్రజలు, ప్రభువులు భక్తిప్రపత్తులతో పూజించాలి. అనేది ఆయన కఠోరమైన ఆశయము.

తన మనుమరాలును ఒకప్రక్క విషకన్యగా తయారుచేస్తూ, ఆమెలో భయంకరమైన అగ్నిని, మహాప్రభంజనాన్ని, తదితర పంచభూతాలను మంత్రపూర్వకంగా ఆవహింపజేస్తున్నాడు.

చక్రమధ్యమున ఆబాలికను ఆసీనురాలినిగాచేసి సౌందర్య దేవతలెల్లరను ఆమెను ఆవహించునట్లు చేస్తున్నాడు. ఆ బాలికను అనంతసౌందర్యవతిని చేయమని చంద్రుని, శచీదేవిని ఉద్దేశించి మంత్రములు చదువుచున్నాడు. పరమేశ్వరునికి ఎదురుగా కూర్చున్న ఆమెపై అక్షతలు, మంత్ర పూర్వకముగా విభూతిని చల్లుచున్నాడు.

ఈ సుందరి శ్రీ కృష్ణశాతవాహనుని మృత్యువు అగుగాక!

ఈ సుందరి శ్రీ కృష్ణశాతవాహనుని పాలి కరాళ దంష్ట్రిక యగుగాక.

ఈ అత్యద్భుతదివ్యసుందరి శ్రీకృష్ణశాతవాహనుని పాలిట మహామృత్యువగు గాక

అని- ఆయన హోమమధ్యమున హోమద్రవ్యములను వేస్తున్నాడు.

ఆయన మంత్రములు పలికేకొద్దీ చక్రమధ్యముననున్న ఆ బాలిక అటు, ఇటు ఊగుచూ ఉంది. ముఖకాంతి పెరుగుచూ ఉంది. మధ్యాహ్నసమయభానునివలె చూచుటకుకూడ సాధ్యముకానంత తేజస్సుతో కన్పిస్తూఉంది.

జాజ్వల్యమానమైన ఆ మహాతేజస్సును చూచిన అచ్చటివారు భయభ్రాంతులయ్యారు.

ఇంతలో పూజ ముగిసింది. "ఓం, తత్-ఫట్" అంటూ ఆమెపై విభూతిని చల్లాడు స్థూలతిష్యుడు. ఆయన సంకల్పమేమోకాని ఆ బాలిక సౌమ్యస్వరూపిణిగా మారింది. అప్పటి ఆమె సౌందర్యాన్ని చూచినవారు ఆశ్చర్యపడ్డారు. సృష్టికర్త జగత్తులో ఉన్న సౌందర్యాన్ని యావత్తు ఒకచోట చేర్చి ఈమెను సృష్టించాడా? అని అనుకున్నారు. శ్రీ కృష్ణశాతవాహనుడు ఈమెను చూచి, అగ్నిమధ్యమునబడ్డ శలభము కావడములో విశేషమేముందీ? అని గూడ అనుకున్నారు వారు.

పూజా మందిరమునుండి ఆ బాలికను చేయి పట్టుకొని స్థూలతిష్యుడు మధ్యనున్న వసారాలోకి తెచ్చాడు. అక్కడ గుమిగూడి వున్నవారందరు ఆమెను చూచి, ఆశ్చర్యమగ్నమానసులయ్యారు.

ఆమెచే ఆకర్షితులయ్యూ స్థూలతిష్యుని భయముచే తమలో తాము ఆ భావనను అణచుకొన్నారు.

"శిష్యులారా! ఇటచేరిన మండలేశ్వరులారా! ఆర్షధర్మ పునరుజ్జీవనాసక్తులగు జనులారా! ఈ బాలికను శ్రీ కృష్ణశాతవాహన మృత్యువుకు గురిగా ఈరోజే వదలు చున్నాను". అని ప్రకటించాడు.

ఇంతలో మలయనాగుడు తటాలున ముందుకుదూకి ఆ బాలికను కౌగిలిలో బంధించాడు. అతని బాహువుల వత్తిడికి సతమతమైన ఆ ఎలజవ్వని ఒక నిట్టూర్పు విడిచి అతన్ని త్రోసివేసింది. క్షణములో అతను నురుగులు గ్రక్కుచూ భూమిపై బడ్డాడు.

స్థూలతిష్యుడు వెంటనే తనవద్దనున్న గంటను మ్రోగించాడు. శిష్యులువచ్చి అచ్చట పడిఉన్న మలయనాగున్ని తీసుకపోయారు.

మలయనాగుని స్థితిని గాంచిన ఆ బాల తటాలునవచ్చి తాత పాదాలపైబడి వెక్కి వెక్కి ఏడ్చింది.

స్థూలతిష్యుడు ఆమెను లేవనెత్తి ఓదార్చాడు.

"తాతయ్యా! నా ఈ శరీరస్పర్శ జీవులకు ప్రాణాంతకమా? నా వాయువులు తాకినవారు యమగృహానికి అతిథులుగా వెళ్లవలసిందేనా?" చెప్పమని ఆమె నొక్కి నొక్కి అడిగింది.

జవాబు చెప్పలేక స్థూలతిష్యుడు ఆలోచనలో పడ్డాడు.

అక్కడివారందరు భయవిహ్వాల మనస్కులై చూస్తున్నారు.

స్థాలతిష్యుని భృకుటి ముడిపడింది. గడ్డము వణికిపోయింది. కన్నులు ఎఱ్ఱనయ్యాయి.

"ఈ ముహూర్తము భంగమైంది. శ్రీ కృష్ణశాతవాహనుని మరణమునకు మరియొక ముహూర్తమును నిర్ణయిస్తాను"-అని ఆ బాలికను తీసుకొని అయన లోనికి వెళ్ళి పోయాడు.

సంధ్య వెలుగును పారద్రోలి చిమ్మ చీకట్లు దిశలను ఆవరిస్తున్నాయ్. ఆకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటూ అక్కడక్కడ ఒక్కొక్కటే కనిపిస్తున్నాయ్. గూళ్ళను చేరుకొంటున్న పక్షుల కిల, కిలా రావాలు ఇంకా వినిపిస్తూనే ఉన్నాయ్. చారుగుప్తుని ఉద్యానవన వాటికలో జన సంచారం తగ్గింది. తోటపనివారలు గృహోన్ముఖులయ్యారు.

ఆ ఉద్యానవనవాటికలో ఒక యువకుడు ఒక లతానికుంజము కడ ఆసీనుడై ఉన్నాడు. అప్పటి అతని వాలకము చూస్తూంటే ఎవరికోసమో ఎదురుచూస్తూ కూర్చున్నట్లుగా కనిపిస్తూంది.

అతని మనసులో ఏవో ఆలోచనలు ముసురు కొంటున్నట్లున్నాయ్. గాలితాకిడికి ఆకులు కదిలినా అతనికి చిరుమువ్వల సవ్వడిగా వినిపిస్తూంది. పిల్లవాయువులు తెస్తున్న జాజిపూలవాసన అతని నాసికను తాకితే, దాన్ని అతను ఒక తన్వంగి కబరీపుష్పసంజనిత పరిమళంగా భ్రమిస్తున్నాడు.

ఒక ప్రక్క అతని మనస్సు భీతిని చెందుచున్నట్లుగా కూడా అనిపిస్తూంది.

తాను చేస్తున్నది కేవలము సాహసమేనా? తాను కట్టుకొంటున్నవి ఆశాసౌధాలు కావుకదా? అని ఆయన మనస్సులో తర్జన భర్జనలు జరుగుచూ ఉన్నాయ్. తన ఆశ ఫలిస్తుందా? లేదా? అని ఆందోళన చెందుచున్నాడు.

"తొలిచూపులోనే ఆమె నా హృదయాన్ని లాక్కుంది. ఆమె రూపు నాయెదలో భద్రమైన ముద్రను వేసుకుంది. నా తలపులు, ఊహలు అన్నీ ఆమే" అనుకొంటున్నాడా యువకుడు.

ఆమెతో మాట్లాడాలనీ, ఆమెను కలిసి ఆమె మనసులోని అభిప్రాయాన్ని అడిగి తెలుసుకోవాలనీ ప్రయత్నిస్తున్నాడు.

తన శిల్పమందిరములో తనచే మలచబడిన తనరూపాన్ని చూసిన హిమబిందు భావన ఎలా ఉందో ఊహించు కొంటున్నాడు.

ఇంతలో ఒక జవ్వని. పదారేళ్ళ పడచుపిల్ల. ఆ దారిన వచ్చింది. నికుంజము మాటున నున్న ఆయువకుడు ఆమె కరమును పట్టుకొన్నాడు. ఆమె ఆగిపోయింది. ఆమె మొగమెత్తి చూచింది. క్షణకాలం నిర్ఘాంతపోయింది.

“హిమా” పిలిచాడు.

“సువర్ణా” ప్రతి పలికింది.

“నీ కొరకే ఎదురు చూస్తూన్నాను”

“నీ కొరకే నేనూ వచ్చాను”

“నమ్మమంటావా!”

“ఎందుకు నమ్మలేవు.”

“నీవు ఒక ఉత్తుంగ హిమవన్నగశిఖరానివి.”

“నేనో సామాన్య శిల్పిని!”

“కావచ్చు, ప్రేమకు అంతరాలు లేవు.”

“అయితే, నీవు నన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నావా?”

“మీరో”?

“నాహృదయాన్ని చీల్చిచూడు. నీప్రశ్నకు జవాబు దొరుకుతుంది. నా హృదయం నిండా నువ్వే కనిపిస్తావు. నాకళ్ళల్లో చూడు వాటి నిండా నువ్వే.”

“నా హృదయంలో కూడ అంతే. అది ఎప్పుడో నీకు దత్తమైంది”

“ఎప్పుడూ!”

“శకటవేగపరీక్షలో మీరు విజయలక్ష్మిని వరించిన నాడే.

“అయితే! ఇంత జాగెందుకో?”

“అక్కడే పొరబడు చున్నావు”

“ఏమిటో? ఆ పొరబాటు,”

“మనము కులీనులము. గౌరవప్రధవంశసంజాతులము. మనకు కొన్ని కట్టుబాట్లున్నాయ్. క్షణికమైన ఉద్రేకానికి చిక్కి పెద్దల గౌరవ ప్రతిష్ఠలకు భంగము కలుగనీయరాదు.”

"కావచ్చు. నీ కోసం ఎన్నోరోజుల నుండి ఎదురుచూస్తున్నాను. ఒకసారి నీతో మాట్లాడాలనీ, నీకరపల్లవాన్ని స్పృశించాలనీ, నీ కనురెప్పలను ముద్దు పెట్టుకోవాలనీ, మనసులోని మాటను చెప్పి బరువు దించుకోవాలనీ ఆతురత పడుచున్నాను."

"నేనూ అంతే. ఒక సారి నీ శిల్పమందిరానికి వచ్చాను, అక్కడ నీవు లేవు. నీవు మలచిన నా రూపాన్ని చూచాను."

"అవును" సిద్దార్థనిక చెప్పింది.

"నేను మలిచిన ఆ నీ రూపం ఎలా ఉంది."

ఒక ప్రణయారాధకుడు తన హృదయం నిండా ఉన్న ఒక మూర్తికి కల్పించిన రూపాన్ని చూడాలే గానీ చెపితే అర్థము కాదు. అదినాపై నీకు గల గాఢమైన ప్రణయానికి చిహ్నము. ఆ తరువాత కూడ ప్రయత్నించాను. ఆ అదనుకై ఎదురు చూస్తూన్నాను.

"ఇప్పుడు, ఆ అవకాశం లభించింది కదా?"

"లభించింది కానీ....................కానీ"

ఆ తరువాత ఆమె మాట్లాడలేదు.

"హిమా! ఎందుకు అసంపూర్ణంగా సంభాషణను ఆపివేశావు?"

"మా నాన్న నన్ను మహారాణిని చేయాలనుకుంటున్నాడు. నాపై ఆయన ఎన్నో ఆశల మేడలు కట్టుకొంటున్నాడు."

"మఱి నీవో?"

"నాహృదయం ఎప్పుడో మీకు దత్తమైంది అని చెప్పితిని కదా?"

"అయితే, ఆ మాటే మీనాన్నతో చెప్పగూడదా?"

"చెప్పవచ్చు. చెప్పితే ఆ ముసలిగుండె ఏమౌతుందో? అని ఆలోచిస్తున్నాను."

"మరి సమస్యకు పరిష్కారం ఎలా?"

దేనికైనా కాలం కలిసి రావాలిగా?

"కానీ, ఆయన కోర్కెకూడ అసమంజసమైనది కాదు కదా?"

"ఎలా?"

"మీ తండ్రి చారుగుప్తుడు సామాన్యవ్యక్తిగాదు. వర్తకలోక సార్వభౌముడు. ఈ విశాల ఆంధ్రసామ్రాజ్యానికే ఆయన మకుటంలేని మహారాజు. శాతవాహన సామ్రాజ్యపునాదులు మీ తండ్రి చారుగుప్తుని భుజస్కంధాల మీదనే నిలబడి ఉన్నాయ్. ఆయన అండ రాజుకు ఎన్నటికీ తరగనికొండ. చారుగుప్తుడు అభ్యర్థించ నక్కరలేదు. నోరువిప్పి అడిగితే చాలు. మహరాజుకు అది ఆజ్ఞవంటిది. ఆయన కోరికను మహారాజు తిరస్కరించలేడు. వేరుగాచెప్పి ఆయన మనస్సును బాధపెట్టలేడు."

"మహారాణికి కావలసిన అందము, అర్హత, అంతస్తు, బుద్ధికుశలత అన్నీ నీలో ఉన్నాయ్. మహారాజ్ఞిపదవిని అలంకరించేందుకు నీవు అన్నివిధాలా అర్హురాలివి."

"నామనస్సు అందుకు సుముఖత చూపడములేదు. ఎంత ప్రయత్నించినా యువరాజుపై మనసు మరలుటలేదు. మహారాజ్ఞినై సంప్రదాయాలకు, ఆచారాలకు బందీనై జీవించలేను. ప్రణయాకాశంలో రెక్కలు విప్పి, స్వేచ్ఛావాయువులు పీలుస్తూ విహరించాలని అని పిస్తూంది."

అక్కడనుండి కదలి వారిర్వురు చేరువలో ఉన్న తటాకం వద్దకు చేరుకున్నారు. దాని ఒడ్డున కట్టిన చంద్రకాంత శిలావేదికపై కూర్చు న్నారు.

నిర్మలమైన ఆ తటాకంలో తమనీడలను చూసుకొని నవ్వు కొంటున్నారు.

అమ్మా! హిమబిందు కుమారీ! అన్న పిలుపు వినిపించింది.

"సువర్ణా! బాలనాగి వస్తూ ఉన్నట్లుంది. ఇక నేను వెళ్ళిపోతాను. ఆమె ఇలా మన ఇద్దరిని చూడడం కూడ మంచిది కాదు." అని ఆమె లేవబోయింది.

సువర్ణశ్రీ పైటను గట్టిగా బట్టి ఆమెను లేవనీయలేదు.

"విడవండి, విడవండి" అంటూ ఆమె తన పైట కొంగును విడిపించుకొని ముందుకు సాగింది.

"హిమా! తిరిగి ఎప్పుడు?"

ఆమె నవ్వుచూ, జవాబు చెప్పకుండా సువర్ణశ్రీని తిరిగి తిరిగి చూస్తూ వెళ్ళిపోయింది.

ఆంధ్రశాతవాహనసార్వభౌముడు రహస్యాలోచన మందిరంలో కూర్చొని ఉన్నాడు. మహామాత్యుడు అచీర్ణుడు, సర్వసైన్యాధ్యక్షుడు సైత్యుడు, చారగణాధ్యక్షుడు శుకభానుడు కూడ అక్కడ గల ఆసనాలపై ఆశీనులై ఉన్నారు. వారంతా ఎవరికోసమో ఎదురు చూస్తూన్నారు.

"జయము, జయము, వర్తక చక్రవర్తి చారుగుప్తులవారు ప్రభువుల సన్నిధికి ఏతెంచుచున్నారు" అని ప్రతీహారి పలికాడు.

చారుగుప్తుడు లోనికివచ్చి తనకై ఏర్పాటుచేసిన ఆసనాన్ని అధిరోహించాడు.

"వర్తక చక్రవర్తీ! చారుగుప్తా! మనకు కప్పము కట్టుటకు తిరస్కరించి తిరుగుబాటు చేసిన మాళవరాజు మన వినీతమతికి లొంగినట్లే లొంగి పులిందులచే తిరుగుబాటు చేయించి, భోజులను సాయముగా తీసుకొని ఉజ్జయినిలో ఉన్న మన వినీతమతిని ముట్టడించాడు. వినీతమతి ధైర్యంగా కోటను కాపాడుచున్నాడు. మన చారులు తెచ్చిన వార్తల ద్వారా పులిందులు ప్రతిష్ఠానమువైపు తమ స్కంధావారాలను తరలించుచున్నట్లుగా తెలుస్తున్నది. మీరు పులిందులతోను, మాళవులతోను వ్యాపారము కలవారు. ఇప్పుడు మన మేమిచేయాలో నిర్ణయించుటకు మీ ఆలోచన చాలా అవసరము."

"ప్రభూ! మీకు నాపై గల అపారవిశ్వాసానికి కృతజ్ఞతలు. ఈ విషయాన్ని నేను కొన్నిరోజుల నుండే ఆలోచిస్తున్నాను. మన సైన్యములో కొంత ప్రతిష్ఠానములో నున్న మన యువరాజుకు బాసటగా పంపాలి. మిగిలిన సైన్యాన్ని తీసుకొని మనము మగధను ముట్టడించాలి. మగదాధిపతిని జయించి, తదుపరి మాళవాధిపతిపై దండు సాగించి, అతన్ని నిర్జించి, పులిందులపై వెళ్ళాలి. ఇట్లుచేయుటవలన పుళిందులు మన వెనుకనుండి వచ్చి మన దండయాత్రను సాగనివ్వరని ప్రభువులు భావించవచ్చు. చుట్టూ శత్రువులు క్రమ్ముకొని ఉన్నప్పుడు మనము విరోధులపై పోవుటవలన ప్రమాదము అధికము కావచ్చు. మాళవమున నున్న మన వినీతమతికి కష్టములు కలుగవచ్చు.

పుళిందులు బలమైన శత్రువులని ప్రభువులు ఆలోచిస్తున్నట్లున్నారు. పుళిందుల యుద్ధనైపుణ్యము కొండలు గుట్టల మీద ఆధారపడి నట్టిది. సమతలము మీద సుశిక్షితులైన మన సైనికులతో తలపడలేరు. మగధను కూడ మనము కళింగము దారినవెళ్ళి ముట్టడించాలి. శత్రువులు మనపోకడలు ఎరుగు నప్పటికే మనము మగధను చేరుకోవాలి. తరువాత వింధ్యాటవుల వెంబడిబడి పుళిందులను నిర్జించవచ్చు. ముందునుండిమనము, వెనుకవైపు నుండి యువరాజు రాగా పుళిందులు మధ్యనచిక్కి మంటలోబడిన శలభములౌతారు.

పై విధంగా మనం యుద్ధాన్ని సాగిస్తే భరుకచ్ఛము కూడ మన వశమౌతుంది. భరుకచ్ఛము పశ్చిమసముద్రతీరములోని ప్రధాన రేవుపట్టణాలలో ముఖ్యమైనది. పాశ్చాత్యద్వీపాలతో వర్తకము చేయుటకు అది మనకు చాలా అవసరము. అది ఇప్పుడు భోజుల అధీనమున ఉన్నందున,మచిలీపట్నం, మోటుపల్లి రేవుల నుండి మనం వ్యాపారాన్ని ఆ దీవులతో చేస్తున్నాము. అందువలన అమితవ్యయమగుచున్నది. భోజులను జయించి, భరుకచ్ఛమును మన ఆంధ్ర సామ్రాజ్యములో చేర్చుకొని అచ్చట మన ప్రతినిధిని ఉంచినయెడల మనము పాశ్చాత్య దీవులతో వ్యాపారాన్ని కొనసాగించుట నల్లేరు పై బండినడక. ప్రభువులు అనుమతించిన ఈ జైత్రయాత్రకు అగు వ్యయమునంతనూ ఈ చారుగుప్తుడే భరిస్తాడు."

చారుగుప్తుల సలహా మహారాజుకు, అచ్చటగల ఇతరులకు సబబుగా కన్పించింది. చారుగుప్తుల దీర్ఘకాలికదృష్టిని, వ్యూహనిర్మాణ దక్షతను వారు శ్లాఘించారు.

ఆ తరువాత కూడా హిమబిందు సువర్ణశ్రీలు తఱచు కలుసు కుంటూనే ఉన్నారు. వారి ప్రేమ ప్రతిదిన ప్రవర్ధమాన మగుచూఉంది.

ప్రేమ త్యాగాన్ని కోరుతుంది, అనేందుకు హిమబిందు సాక్షీభూతంగా నిలవాలను కున్నట్లు ఉంది. అందుకే ఆమెను సువిశాలఆంధ్ర మహాసామ్రాజ్య పట్టమహిషీపదవి సైతము ఆకర్షించలేకుంది.

తానేమో సువర్ణశ్రీని ప్రేమిస్తూంది. తన తండ్రి మహారాణిని చేయాలనుకుంటున్నాడు. ఈ విచికిత్స హిమబిందు మనస్సులో నిరంతరం మెదలుతూ వుంది.

ధైర్యంచేసి తననిర్ణయాన్ని తండ్రికి చెప్తే ఆయనముదుసలిగుండె తట్టుకోలేదని ఆమె భయపడుచూ ఉంది.

విచికిత్స ఆందోళనగా మారింది. ఆమె శరీరఉష్ణోగ్రతలో మార్పువచ్చింది. దాదులు ఆవేదన చెందుచూ ఉన్నారు.

ఈవిషయాన్ని బాలనాగి అవగతంచేసుకొంది. చారుగుప్తుల వారితో చెప్తే ఏమిజరుగుతుందో? చెప్పకుంటే తనకు ఏ ఇబ్బంది వస్తుందో? అని ఆలోచిస్తూ ఉంది.

చారుగుప్తుడు యుద్ధయాత్రకు వెళ్ళినతర్వాత ఒక రోజున ఉద్యాన వనవాటిక నుండి వచ్చిన హిమబిందు ఉన్నట్లుండి స్పృహతప్పి పడిపోయింది. వైద్యశేఖరులైన ఆనందుల వారికి వార్తపంపారు. హిమబిందు నాడిని పరీక్షించాడు. తన సంచిలోని ఒక మూలికను తీసి, ఆమెకు వాసన చూపించాడు. ఆమె స్పృహ లోనికి వచ్చింది.

ఆమె దేహస్థితిని గమనించిన ఆనందుడు, ఆమె ఏదో ఆవేదనతో, ఎటూ తేల్చుకొనుటకు వీలుకాని సమస్యను గుఱించి తీవ్రంగా ఆలోచిస్తూ ఉందని గమనించాడు.

ఆమె బాగా తేరుకొన్న తర్వాత, "అమ్మా! కుమారీ ఎందుకింతగా ఆవేదన చెందుచున్నావు? నీ మనస్సులో ఉన్న కోరిక ఏదో నాతో చెప్ప కూడదా? ప్రశ్నించాడు.

ఆమె ముఖం సిగ్గుతో ముడుచుక పోయింది.

"చిరంజీవీ! నీవు చెప్పకున్నా అనుభవజ్ఞుడైన వైద్యుడు తృటి కాలములో గమనించగలడు."

"బాబయ్యా! అని అతనిఒడిలో ఆమె వాలిపోయింది."

"నీవు ఎవరినైనా ప్రేమిస్తున్నావా? తల్లీ! సూటిగా అడిగాడు."

"అవును."

"అయితే ఆ విషయాన్ని మీతండ్రికి చెప్పలేదా!"

"లేదు."

"ఎందుకు చెప్ప లేదు!"

"నా మనసులోని కోర్కెకూ, నాన్నగారి ఆలోచనకూ తేడాఉంది."

"అంటే నీవు యువరాజు శ్రీకృష్ణశాతవాహనులను ప్రేమించుట లేదా?"

"లేదు."

"సమవర్తిని ప్రేమిస్తున్నావా?"

"లేదు."

"మఱి నీ మనస్సును కైవసం చేసుకొన్న ఆ భాగ్యవంతుడు ఎవరో చెప్పు తల్లీ!"

"సువర్ణ శ్రీ."

ఆ మాటలు విన్న అనందుడు ఆశ్చర్యపోయాడు. ఏమిటో! సృష్టి వైచిత్ర్యము అని క్షణకాలం ఆలోచించాడు. హిమబిందు వర్తక సార్వభౌముని గారాల పట్టి. ఆంధ్రశాతవాహన సామ్రాజ్యానికి ఆయన పెట్టని కోట. తరగని అండ. వింధ్యకు ఆవల కూడ ఆంధ్రపతాకం రెప రెప లాడాలి. దక్షిణాపథమేగాక ఆర్యావర్త మంతాకూడ ఆంధ్రుల ఏలుబడిలోకి రావాలి. ఆ విశాలమహాసామ్రాజ్యానికి శ్రీకృష్ణశాతవాహనులు ప్రభువులు కావాలి. ఆయనకు తన కూతురును ఇవ్వాలి. తన గారాల పట్టి. ప్రాణంలో ప్రాణం. ఆమె ఆ విశాలమహాంధ్రసామ్రాజ్యానికి మహారాణి కావాలి అని చారుగుప్తుల వారు ఆలోచిస్తున్నారు. ఆ మహాప్రయత్నములో భాగంగానే మాళవాదుల జయించేందుకు, పాటలీపుత్రాన్ని తన ఏలుబడిలోనికి తెచ్చేందుకు మహారాజుచే యుద్ధయాత్రను చేయిస్తున్నాడు. ఆ యుద్ధమునకు అయ్యే ఖర్చునంతటినీ ఆయనే భరిస్తున్నాడు. అయితే తన కూతురు, తాను కట్టుకొంటున్న బంగారుమేడలను కూల్చివేయ నున్నదని ఆయన ఎరుగడు. విధి ఆయనకు విరుద్ధంగా ఉంది. విధి వైపరీత్యము అంటే ఇటువంటిదేమో? అనుకున్నాడు.

"శ్రీకృష్ణశాతవాహనులకన్న సువర్ణశ్రీ గొప్పవాడా? ఎందుకు అలా సువర్ణశ్రీని ప్రేమిస్తున్నావు?" ఆనందుల వారు తిరిగి ప్రశ్నించారు.

"బాబయ్యా! సువర్ణశ్రీ కార్యదీక్షను శకటవేగపరీక్షాసమయాన చూచాను. విజయలక్ష్మీపరిగ్రహణ సమయమున ఆయన ముఖములో వికసించిన కళా, కాంతులు నా హృదయంలో తొలి కోర్కెను పుట్టించాయి.

అనంతరము ఆయన శిల్పమందిరాన్ని సందర్శించాను. ఆయన శిల్పకళా ప్రావీణ్యము నన్ను ఆశ్చర్యచకితను చేసింది. ఆయన లలితకళలు మూర్తీభవించిన యువకుడు. మసృణ మనోజ్ఞ భావుకుడు. సృష్టిలో తాను చూచిన దానికి శాశ్వతరూపం కల్పించగల సమర్థుడు. ఆయన స్నిగ్ధమనోహరస్వరూపము, మృదులతరస్వభావము నన్ను ఆకర్షించింది. నాకు రాజ్యభోగాలమీద ఆశ లేదు. స్వేచ్ఛగా ప్రణయాకాశంలో విహరించాలని కోరుకొంటున్నాను. అందుకే నాకు యువరాజుమీద మనసు పోలేదు."

"కుమారీ! నీ భావనను కాదన లేను. అయితే, ఆ విషయములో ఆందోళన చెందడం ధీరోదాత్తతకు ఉదాహరణం కాదు. యుక్తితో, ధైర్యసాహసాలతో, ఉపాయంగా సమస్యను పరిష్కరించు కొనేందుకు ప్రయత్నించాలి. అధైర్యపడ కూడదు."

"బాబయ్యా! నా మనోగత భావాలను మీకు వివరించాను. నీవే ఈ సమస్యను పరిష్కరించాలి. భారమంతా నీమీదే వేస్తున్నాను."

"మంచిదమ్మా! అదనుచూచి మీ నాన్నతో మాట్లాడుతాను. అంతవరకు అధైర్యం చెందక ఆనందంగా ఉండేందుకు ప్రయత్నించు. మనస్సుకు శ్రమ కలిగించుకోకు తల్లీ!" అని వెళ్ళిపోయాడు ఆనందుడు.

ముత్తవముక్తావళీదేవి మనుమరాలిఆరోగ్యము కుదుటపడినందుకు ఆనందించింది. ఆఘ మేఘాలమీద ఆ వార్తను చారుగుప్తుల వారికి అందించారు. ఆరోగ్యము కుదుట పడిందని, ఆవేదన చెందవలసిన పనిలేదు అనికూడ అవార్తలో తెలియ జేశారు.

చారుగుప్తులవారు ప్రధానసైన్యాధిపతి, ప్రధానామాత్యులతో కలిసి యుద్ధవ్యూహాన్ని తయారు చేశారు.

అదిశుక్ల పక్షమందలిదశమి. వెన్నెల తెల్లగా కాస్తూ ఉంది. చల్లని వాయువులువీస్తున్నాయి. హిమబిందు, బాలనాగితో కలిసి అంతః పురోద్యానవనంలో విహరిస్తూంది. నలుగురు రివ్వునవచ్చి హిమబిందు, బాలనాగిల ముఖాలపై గుడ్డలు కప్పి, హిమబిందును ఎత్తుకు పోయారు. బాలనాగి భయంతో స్పృహదప్పి పడిపోయింది.

మఱికొందరు అంతఃపురములోని శయనాగారంలోనికి వెళ్ళారు. ఆదమరచి నిద్రిస్తున్న ముత్తవముక్తావళీదేవినీ ఎత్తుక పోయారు.

రక్షకభటులు కావలి ఉన్న చారుగుప్తుని భవనమును ఈ చోరులు ఎట్లు చేరుకొన్నారు! అని ప్రజలు ఆశ్చర్యముతో చెప్పుకొంటున్నారు.

హిమబిందు, ముక్తావళీదేవుల జాడను తెలుసుకొనేందుకై వేగులవారు బయలుదేరారు.

చారుగుప్తుని అశ్వశాలలోని ఉత్తమాశ్వాలను ఎక్కి చారుగుప్తుని సైన్యాధిపతులు వేగులను అనుసరించారు.

హిమబిందువు, ముక్తావళీదేవి జాడల తెలుసుకొనుటకై సువర్ణశ్రీ తన మిత్రుడు మహాబలగోండునితో ఆరాత్రే బయలుదేరాడు.

సమవర్తి ఒక అక్షౌహిణి సైన్యమును తీసుకొని, దుర్గ మారణ్యముల వెంబడి వెళ్ళి ఉజ్జయినిని ముట్టడించిన మాళవ సైన్యమును ఢీ కొన్నాడు.

ప్రతిష్ఠానమున నున్న యువరాజుకు సాయంగా కొంత సైన్యము పంపబడింది.

శుకనాసుని అధ్వర్యమున గల చారగణము ఉజ్జయినికీ, ప్రతిష్ఠాన నగరానికీ జాగ్రత్తగా వార్తలు అందిస్తూ ఉంది. మాళవుల ఎత్తుగడలు మహారాజు ఎప్పటి కప్పుడు తెలుసు కుంటున్నాడు.

సామంతులకు, తనకు అభిమానులైన రాజులకు తన దిగ్విజయ యాత్ర విషయం తెలియచేశాడు మహారాజు. వారంతా సైన్యముతో తరలివచ్చి కృష్ణానదికి ఇవతల విడిచి యున్నారు.

తన దిగ్విజయయాత్రకు కారణాన్ని తెలుపుచూ, మాళవులు తిరుగుబాటుచేయుట, వారిని అణచుటలోని ఆవశ్యకత కూడ ప్రజలకు తెలిజేశాడు శ్రీముఖమహారాజు.

ప్రజలు అంగీకారాన్ని ప్రకటించారు.

సమవర్తి సేనతో వచ్చి మాళవులను తాకుచున్న విషయం వేగుల వారివలన కోటలో ఉన్న వినీతమతికి తెలిసింది.

రాత్రి సరిగ్గా పండ్రెండు గంటల సమయములో సమవర్తి మాళవ సైన్యమును ఢీ కొన్నాడు. సరిగ్గాఅదే సమయములో వినీతమతి కోట ద్వారాలను తెఱచి శత్రుసమూహంపై విరుచుక పడ్డాడు. మాళవుల పని అడకత్తెరలో పోకవలె నయింది. సమవర్తిసేనలో ఐదువేల మంది మల్లులు ఉన్నారు. వారిదేహమంతా ఖడ్గమృగపు చర్మముతో కప్పబడి ఉంది. కుడిచేత ఆరడుగులప్రమాణం గల శూలాలు ధరించారు. మొలకు చిన్నకత్తి ఉంది. ఆ శూరులు ఏనుగంత బలము కలవారు. చావుకైనా సిద్ధపడతారే కానీ శత్రువుకు వెన్ను చూపని మహాధైర్యవంతులు.

యుద్ధము ప్రారంభమైన నాలుగుగంటలకే ఆంధ్రసైనికులకు విజయం లభించింది.

సమవర్తి కోటలో ప్రవేశించాడు. వినీతమతి ఆనందముతో స్వాగతం పలికాడు.

మాళవసైన్యమునకు తోడుగా సుశర్మ పంపిన సైన్యములు వచ్చి చేరాయి. వారితో బాటు శివభూతి వచ్చి మాళవునికి ధైర్యము చెప్పి మరికొంత కాలము ముట్టడి కొనసాగించుటకు పురికొల్పాడు. ముట్టడి సాగుచున్నకొద్దీ కోటలో ఆహారపదార్థాలకు లోటు ఏర్పడడం మొదలైంది. దీనికి తోడు ఉజ్జయినీ నగరానికి నీటిని సరఫరా చేసే కాలువల్లో విషం కలుప సాగారు మాళవులు. మఱికొంత కాలము ముట్టడి కొనసాగితే ఉజ్జయిని లోని ఆంధ్ర సైన్యానికి ముప్పు కలిగే పరిస్థితి కలిగేటట్లుంది.

చారుగుప్తుడు ప్రభువును దర్శించాడు. ప్రభూ! వేగులవారి వార్తలనుబట్టి ఉజ్జయినీలోని మనవారిపరిస్థితి భయానకము కాగలిగే కాలము మరెంతో దూరం లేనట్లు ఉంది. మనము జాగు చేయరాదు. వెంటనే సైన్యాన్ని కదిలించాలి.

ఒక సుముహూర్తాన ఆంధ్ర సైన్యములు జైత్రయాత్రకు బయలు దేరాయి.

ధాన్యకటకము నుండి ఉజ్జయినిని చేరుటకు ప్రధానమైన మార్గాలు మూడు ఉన్నాయి. అందులో ఒకటి ప్రతిష్ఠాననగరమువెంబడి వెళ్ళుట. అట్లు వస్తే ఆసైన్యమునకు దారిలోనే అడ్డు తగులుటకు మాళవులు రెండువేల పుళిందుల సైన్యాన్ని ఉంచారు. వారిని ఎదుర్కొనుట వల్ల సైన్యనష్టము జరుగ వచ్చు. రెండవది దక్షిణకోసలము మీదుగా విదేహను చేరుకొని, అక్కడ శోణనదినిదాటి అవంతి మీదుగా ఉజ్జయినిని చేరవచ్చు. కానీ ఇది చుట్టుదారి. అలా వెళ్లుట వలన ఎక్కువ కాలం పట్టవచ్చు. ఈ లోగా శత్రువులు పసిగట్టారు. మూడవది గోదావరితీరం వెంబడి వెళ్లడం.

శత్రువులు ఆంధ్ర సైన్యములు ఏదారిన వస్తాయో? అని జాగ్రత్తగా గమనిస్తున్నారు.

గోదావరిని ఓడల సహాయమున దాటి ఆ నదీతీరము వెంబడి శాతవాహనసైన్యములు నడుస్తున్నవి.

చారుగుప్తుడు సైన్యమునకు కావలసిన అన్నిసౌకర్యములను కలుగ జేస్తూ వారిని ఉత్సాహ పరుస్తున్నాడు.

సైన్యములు బయలుదేరుటకు ముందు శ్రీముఖచక్రవర్తి,- "తన వద్దనున్న సైన్యమును జట్లు జట్లుగా విడదీసి వేటకు పోవువారివలె బయలుదేరి వారందరు త్రయంబకేశ్వరమువద్దకలుసుకోవాలనీ, వారంతా అక్కడ నుండి భరుకచ్ఛముపై దాడిచేసి, భరుకచ్ఛము స్వాధీనము చేసుకొని, అక్కడ యేబదివేల సైన్యమును ఉంచి, మిగిలిన సైన్యమును తీసుకొని యువరాజు ఉజ్జయినికడ ముట్టడించి ఉన్న మాళవసైన్యమును ఎదుర్కోవాలని" ప్రతిష్ఠానముననున్న యువరాజుకు వార్త పంపాడు.

తమ వద్దగల సైనికులను మాళవసైనికుల వేషములో ఉజ్జయినికి ఆహారధాన్యమును పంపు ఏర్పాటు చేశాడు.

అనుకున్నవి అనుకున్నట్లుగా సవ్యంగా సాగాయి. అని వార్తాహరులు ప్రభువుకు తెలియజేశారు.

ఒకనాటి తెల్లవారు ఝామున ఒకవైపు నుండి యువరాజు సైన్యము, మరియొకవైపు నుండి మహారాజు సైన్యము, మూడవవైపు నుండి వినీతమతి, సమవర్తుల నాయకత్వంలో ఉజ్జయినీలోని సైన్యము మాళవసైన్యము పై విఱుచుక పడింది. గత్యంతరము లేక మాళవులు లొంగి పోయారు.

జయ! జయ! ఆంధ్రశాతవాహనమహాసార్వభౌమా! మాళవ సామ్రాజ్యహస్తంగత వీరకిశోరా! అంటూ సైనికులు నినాదాలు చేశారు.

చారుగుప్తుని కన్నులనుండి ఆనంద బాష్పాలు రాలాయి. శ్రీకృష్ణ శాతవాహనుని వైపు చూచి, సంతృప్తిగా నిట్టూర్పు విడిచాడు.

"ప్రభూ! మనకు పాటలీపుత్రాన్ని జయించడమే మిగిలింది. వింధ్యకు దక్షిణభాగాన తమ భుజబలరక్షితమై ఆంధ్రక్షోణి రంగరంగ వైభవంగా ఆనందంగా ఉంది. సమర్థుడైన నాయకుడు లేక వింధ్యకు ఉత్తర భాగానగల ప్రజలు శాంతి సౌఖ్యాలు కరువై, తగిన రక్షణ లేక , నిరంతరాందోళన చెందుచున్నారు. వారు తమ ఏలుబడికై అఱ్ఱులుచాచి ఎదురుచూస్తూ ఉన్నారు. జాగుచేయక సమర శంఖాన్ని పూరించండి. ఆంధ్రపతాకము పాటలీపుత్రకోటపై రెప రెప లాడుచూ ఉంటే చూచి

సంతృప్తి చెందాలని ఈ ముదుసలి హృదయం తహ తహ లాడుచూ ఉంది'' అని ప్రబోధించాడు.

వైశాఖపూర్ణిమరాత్రి. నర్మదా నదీతీరం. వింద్యపర్వతములలో ప్రకృతి ఏర్పరచుకొన్న చక్రాకారములో ఉన్నలోయ.

మాహాబలగోండునితో అలోయముఖద్వారాన ఉన్న తటాకాన్ని చేరుకొన్న సువర్ణశ్రీ ఆ తటాకాన్ని దాటుటకు అనువగు దోనె కోసం ఎదురుచూస్తూన్నాడు. ఇంతలో ఇర్వురు రాజభటులు దోనెను నడుపుకుంటూ వచ్చి సువర్ణశ్రీ కూర్చున్న స్థలానికి కొంత దూరములో గట్టునెక్కి ఎక్కడికో వెళ్ళిపోయారు.

సువర్ణశ్రీ ఆ దోనెసహాయముతో ఆ తటాకాన్ని దాటాడు. మెల్లగా గృహముఖ ద్వారాన్ని చేరుకొన్నాడు. ఆ ద్వారం ఇద్దరు లేక ముగ్గురుకన్నా మించి కలిసి వెళ్ళడానికి వీలుతేనంత వెడల్పు గలది. మార్గమంతా కారుచీకటితోనిండుకొని ఉంది. సువర్ణశ్రీ మొలనున్న ఖడ్గాన్ని చేతికి తీసుకొని జాగ్రత్తగా లోనికి కెళ్ళాడు. కొంతదూరము నడచాడు. అవతల పెద్దవిశాలమైన బయలు. ఆ బయలులో కొన్ని పటకుటీరాలు కన్పించాయి. ఆ గృహద్వారం అంతములో అంటే ఆవిశాలమైన బయలు స్థలములో ప్రవేశించేందుకు ముందు ఇర్వురు రాజభటులు సాయుధులై అటు ఇటు తిరుగుచూ కన్పించారు.

సువర్ణశ్రీ ఒక రకమగు కూతవేశాడు. అది అచ్చంగా పుళిందులు కొన్ని సంకేతాలను సూచించుటకు అప్పుడప్పుడు వేయు కూతవలె ఉంది. ఆ కూతను విని రాజభటుడు లోనికి కెళ్ళాడు. మిగిలినవాడు అచ్చటే కాపలా కాస్తూన్నాడు. సువర్ణశ్రీ వెంటనే వాని పైబడి ఒక ముష్టి ఘాతముతో వాని వాయువులు హరించి అక్కడే చీకటిమూలకు త్రోసివేశాడు. ఆతని దుస్తులు ధరించి ఆతని స్థానములో నిలబడ్డాడు.

"లోపలికి వెళ్ళిన భటుడు వచ్చి లోన ఎవరూ కనిపించలేదు. ఇక్కడికి ఎవరైనా వచ్చారా?'' అని ప్రశ్నించాడు.

"లేదు'' అని సంజ్ఞా సూచకంగా తెలియ జేశాడు నోరు విప్పకుండా సువర్ణశ్రీ. అంతటితో ఆగక అటువైపు వెళ్ళిచూడు మన్నట్టుగా ఒక సంజ్ఞ చేశాడు సువర్ణశ్రీ.

భటుడు ఆవైపుకు వెళ్ళాడు. అతను వెనుదిరిగి రెండు అడుగులు వేయగానే సువర్ణశ్రీ అతన్ని వెనుక నుండి తన రెండు చేతులతో

అదిమిపట్టుకొని ఆయువు స్థానములో మోకాలితో గట్టిగా పొడిచాడు. అతనికి ఈ భూమిపై నూకలు చెల్లాయి. సువర్ణశ్రీ ఆ శరీరాన్ని ఈడ్చుకపోయి ఒక మరుగుప్రదేశంలో ఎవరికి కనిపించకుండా పడవేసి, అతని చేతికిగల ఉంగరాన్ని తీసుకొని తనవ్రేలికి పెట్టుకొన్నాడు. ఆ ఉంగరముపై పుళిందులు తమ వారిని తెలుసు కొనేందుకు ఏర్పరచు కొన్న సంకేతము ఉంది.

అప్పటికి అర్ధరాత్రి అంటే రెండు ఝాముల సమయం గడచి పోయింది. కాపలావారినందరినీ నిద్రాదేవి తన కౌగిలిలోనికి ఆహ్వా నిస్తూఉంది.

సువర్ణశ్రీ లోనికి వెళ్ళాడు. అక్కడ చాలా పటకుటీరాలు కన్పించాయి. అతను అలా వెళ్ళేటప్పుడు ఒకరిద్దరు భటులు ఎదురొచ్చారు. నోటి పై వ్రేలు నుంచుకొని సువర్ణశ్రీ తన చేతికిగల ఉంగరాన్ని చూపించి ముందుకు వెళ్ళాడు. కొన్ని కుటీరాలు ఖాళీగా ఉన్నాయి.

కొంత దూరం వెళ్ళగా ఒక కుటీరంలో ఒక మృదుతల్పముపై ఒక బాలుడు పంద్రెండుఏండ్ల వయస్సువాడు పవళించి ఉన్నాడు. కుటీరంలో దీపాలు వెలుగుచూ ఉన్నాయి. ఆ వెలుగులో ఆతని ముఖాన్ని పరిశీలించి చూచాడు. అతడు మంజుశ్రీ. మాయమైన శ్రీముఖమహారాజుగారి ద్వితీయ పుత్రులు. చేతులతో చిన్న సవ్వడిచేశాడు. మగతనిద్రలో ఉన్న కాపలాభటుడు కళ్ళువిప్పి సువర్ణశ్రీ వైపు చూచాడు. సువర్ణశ్రీ తెలివిగా ఒకవైపు చేతినిచూపి అక్కడికి వెళ్ళుమన్నట్లుగా సంజ్ఞచేశాడు.

సువర్ణశ్రీ లోపలికి వెళ్ళి, మంజుశ్రీని తట్టిలేపి, తనను ఎరిగించుకొని తనతో వచ్చేందుకు వీలుగా సిద్ధంగా వుండమని చెప్పి కాపలాభటుడు ఉన్న స్థానములో నిలబడి ఉన్నాడు. ఆ భటుడురాగానే అతని పైబడి అతని నెత్తిపై ఒక పిడిగ్రుద్దు గుద్దాడు. ఆ గ్రుద్దుకు అతడు నోట రక్తముగ్రక్కుకొంటూ పడి విగతజీవుడయ్యాడు. ఆభటుని దుస్తులను మంజుశ్రీచే ధరింపజేసి ఇర్వురు కలిసి కొంతదూరం వెళ్ళారు. అక్కడ ఒక పటకుటీరములో ఇద్దరు స్త్రీలు కన్పించారు.. ఒకరు హిమబిందు. మరొకరు ఆమెముత్తవ్వ ముక్తావళీదేవి. సువర్ణశ్రీ ఆనందానికి అవధులులేవు, అక్కడున్న కాపలా భటుల్లో ఒకరు ఎక్కడికో అప్పుడే వెళ్ళి పోయినట్లుంది. ఉన్న ఆ ఒక్కడు కూడ నిద్రమత్తులో కళ్ళుమూస్తూ

తెరుస్తూఉన్నాడు. సువర్ణశ్రీ లాఘవంగా వానిపైబడి వాన్ని బంధించి నోట్లో గుడ్డలుపెట్టి ఒక మూలకు లాగాడు.

ఆ స్త్రీలవద్దకువెళ్ళి తనవద్దగల ఆంధ్రశాతవాహనప్రభుత్వ గుర్తును చూపి తన్ను ఎరిగించుకొన్నాడు. హిమబిందుకుమారి దుఃఖమును పట్టలేక అతని భుజముపై ముఖాన్ని ఉంచి వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టింది. సువర్ణశ్రీ ఆమెను ఊరడించి ఇది ఏడ్చుటకు తగిన సమయంకాదని తనవెంట జాగ్రత్తగా రమ్మని చెప్పి వారిని వెంట తీసుకొని మునుపటి గృహద్వారానికి వచ్చారు.

అప్పటికి నాల్గవఝాము ప్రారంభమైంది. కాపలావారు తమ స్థానాలు మార్చుకొను చున్నారు.

ఇద్దరుభటులు ఆ ద్వారము వద్ద నిలబడి ఉన్నారు. సువర్ణశ్రీ అతిజాగరూకుడై ఒక ఊపున ఆ భటునిపైబడి కత్తితో అతని తలను ఉత్తరించాడు. అది గమనించిన ప్రక్కనున్న భటుడు అపాయ సూచకమగు ధ్వనిని చేస్తూ సువర్ణశ్రీ పైకి రాబోయాడు. సువర్ణశ్రీ అతన్ని తన ఖడ్గముతో నడుము భాగాన గొట్టగా ఆతడు రెండు ఖండములై పడిపోయాడు.

ఇక ఆలస్యంచేస్తే అమృతం విషం కాగలదని ఆ స్త్రీలను, బాలుణ్ణి ముందుకు నడిపిస్తూ తాను వెనుక నడుస్తున్నాడు.

అపాయసూచకధ్వని వల్ల కొందరుభటులు వచ్చి సువర్ణశ్రీని ఎదిరించారు. కానీ ఖడ్గయుద్ధములోనిపుణుడైన సువర్ణశ్రీ భటులందరినీ ఖడ్గమాత్రసహాయుడై వధిస్తూ ముందుకు నడిపించుకొంటూ లోగు వెలుపలి ద్వారానికి చేరుకొన్నాడు.

మహాబలగోండుడు అప్పటికే ఆటవిక సైనికులతో కొన్ని దోనెలను సిద్ధంగా ఉంచి ఉన్నాడు. వారు వారి నందరినీ తటాకాన్ని దాటించారు. ఆవల కొన్నిదినాలకు మంజుశ్రీ రాకుమారుడు, హిమబిందుకుమారి, ముక్తావళీదేవి ధాన్యకటకాన్ని చేరుకొన్నారు.

వారిని విడిపించిన తీరును విన్న మహాబలగోండుడు స్నేహితుడు సువర్ణశ్రీ ధైర్యసాహసాలను, సమయస్ఫూర్తిని, కార్యదీక్షను, శ్లాఘించాడు.



తొలిసంజకెంజాయతో ధాన్య కటకములో తెల్లవారింది. ప్రభాత భానుని అరుణకిరణాలతో కృష్ణానది ఇసుకతిన్నెలు బంగారు చీరెలుధరించి నట్లున్నాయి.

ధాన్యకటకమహానగరములో ఎక్కడ చూచినా ఆనందోత్సాహాలు కన్పిస్తున్నాయి. ప్రజలముఖాల్లో ఆనందము తాండవిస్తూంది.

బౌద్ధులు మహాచైత్యములలో ప్రార్థనలు సలుపుచున్నారు. హైందవులు తమ తమ ఆరాధ్య దేవతల ఆలయాలకు వెళ్ళి పూజలు చేయించి నారికేళఫల నైవేద్యాదులు సమర్పిస్తున్నారు.

"మాయమైన మహారాజుకుమారుడు మంజుశ్రీ, హిమబిందు కుమారి, ఆమె ముత్తవ్వ ముక్తావళీదేవిక్షేమంగా తిరిగి నగరాన్ని చేరుకొన్నారు. అంతేచాలు" అనే మాటలు పట్టణములో ప్రతివారి నోట వినిపిస్తున్నాయి.

రాజకుమారుని, వర్తక సార్వభౌముల పుత్రికను, ముక్తావళీదేవిని శత్రువులనుండి ఒక్కడే విడిపించి సురక్షితంగా పట్టణానికి చేర్చిన సువర్ణశ్రీ ధైర్యసాహసాలను ప్రజలంతా వేయినోళ్ళతో పొగుడుచూ ఉన్నారు.

చారుగుప్తులకుటుంబాన్ని భగవానుడు చల్లగా చూచాడు. హిమబిందుకుమారికి ఏమైనా అయితే చారుగుప్తులవారు జీవించి యుండగలరా? ఆయన ప్రాణవాయువులు అనంత వాయువులలో కలిసిపోవా? అమ్మో! అలాజరిగితే ఆంధ్రశాతవాహనసామ్రాజ్యము ఏమౌతుందో? చారుగుప్తులు లేని ఆంధ్రసామ్రాజ్యాన్ని ఊహించగలమా? అని కూడ ప్రజలు చెప్పుకొంటూ ఉన్నారు.

రాజకుమారుడు మంజుశ్రీ, హిమబిందుకుమారి, ముక్తావళీదేవి క్షేమంగా నగరాన్ని చేరుకొన్న విషయాన్ని వార్తాహరుల ద్వారా దండయాత్ర లో ఉన్న శ్రీముఖమహారాజుకు, మహారాణికి, చారుగుప్తునకు తెలియజేయబడింది. వారంతా ఎంతో ఆనందపడ్డారు. కుమారుడు సురక్షితంగా నగరాన్ని చేరుకొన్నందుకు మహారాణి మరింతగా సంతసించింది.

తమ రాజుకు, తమరాజ్యానికి అన్ని రకాల ఆధారంగా ఉన్న చారుగుప్తుల కుటుంబానికి తన కుమారునివల్లకలిగిన ప్రయోజనాన్ని విన్న సువర్ణశ్రీ తల్లి దండ్రులు ఎంతో ఆనందపడి, "పితౄణాన్ని తీర్చావయ్యా!" అంటూ సువర్ణశ్రీని ఆశీర్వదించారు.

సువర్ణశ్రీ తన్ను రక్షించుటతో హిమబిందుకుమారిలో అతని పై గల ప్రేమ మరింత ప్రవర్ధమానమైంది. అతన్ని తప్ప ఇతరుని వివాహం చేసుకోగూడదన్న నిశ్చయం ఆమెలో మరింతగా బలపడింది.

దండయాత్రలో ఉన్న సైన్యాలు మరింత ఉత్సాహంతో ముందుకు కదిలాయి.

ఏమిటీ! ఈ సృష్టి వైచిత్ర్యము. భగవంతుడు లేడని ప్రచారం చేసేవారికే ప్రాధాన్యము పెరుగుచున్నది. సృష్టి, స్థితి, లయాలకు మూలకారణుడైన ఆ పరమేశ్వరుని తత్వమును అవగాహన చేసు కొనుటలో ఈషణ్మాత్రము కూడ శాస్త్రవిహితపరిజ్ఞానము లేని వారంతా మత ప్రచారకులయ్యారు. వారికి రాజాధిరాజుల ఆదరణ లభించడమా? ఈ పాషండమతాలు ఈ ప్రపంచాన్ని ఎంతటి దుస్థితికి తీసుకవస్తాయో? ఏమో? - అని ఆలోచిస్తున్నాడు స్థూలతిష్యుడు.

"మహర్షులకు ప్రణామాలు"

స్థూలతిష్యుడు కన్నులు తెరచి చూచాడు.

"ఎవరు మీరు?" - ప్రశ్నించాడు.

"అమృతపాదార్హతులు స్వామీ!"-శిష్యుడు జవాబిచ్చాడు.

"ఓహో! పరమేశ్వరుడులేడు అను పాషండమత ప్రధానాచార్యుడు. మంచిది కూర్చోండి."

అమృతపాదార్హతులు ఎదురుగాఉన్న ఉన్నతాసనము పై కూర్చున్నారు.

"మీ బుద్ధుడు ప్రపంచమును ఏమనెను?" ఇది స్థూలతిష్యుని ప్రశ్న.

"ప్రపంచమంటే దుఃఖమని తథాగతులు సెలవిచ్చి ఉన్నారు" - అమృతపాదులు.

"దుఃఖము పామరునకేగానీ జ్ఞానికి కాదు గదా? అయితే దుఃఖమునకు కారణమేమి?"

"తృష్ణ" -

"ఆ తృష్ణను, కోరికలను అణచుకొన్న వారంతా జ్ఞానులేనా? జ్ఞాని కావడానికి ఇదొక్కటే చాలునా?"

"తథాగతుని ఉద్దేశ్యము కోరికలు మానవులకు దుఃఖాన్ని కలిగిస్తా యని. ఆ కోరికలను నశింపజేసుకుంటే మానవులు దుఃఖమునకు దూరము కాగలరని భగవానుని ప్రబోధము."

"జ్ఞానులకు దుఃఖమంటక పోవుటకు కారణము అదికాదు. వారు మంచిచెడుల తారతమ్యాన్ని విమర్శనచేసి తెలుసుకోగలరు. రాగ ద్వేష అసూయాదులకు అతీతంగా వ్యవహరించ గలరు. సర్వమూ ప్రారబ్దము ననుసరించి వచ్చేవే. అందుచే తాను నిమిత్తమాత్రుడు. మానవుడు తన కర్తవ్యాన్ని నిర్వహించేందుకే పుట్టాడు. ఆపైని ఫల అఫలముల చర్చ చేయడు."

"అదే కోరిక లేదు అని మీరంగీకరిస్తున్నారు. తథాగతుడు అదే సెలవిస్తున్నారు. మీరు తిరిగి తథాగతుని వద్దకే వచ్చారు."

"అట్లని మీరు ప్రజలకు నివృత్తి మార్గాన్ని బోధిస్తారా? అయితే ఈ ప్రపంచనడక సాగేదెట్లు?"

"ప్రవృత్తిమార్గము కర్మకు కారణము కాదా?"

"అదే వేదధర్మమునకు, బౌద్ధ మతధర్మమునకు గల ముఖ్యమైన తేడా. మీబౌద్ధులు ఎల్లప్పుడు కోరికలను నశింప జేసుకో. దేవుడు లేడు. అని బోధిస్తూ ప్రపంచనడక సాగాలంటారు. దేవుడంటూ ఒకడు ఉన్నాడు. ఒకే సూర్యుడు సమస్త జీవులకు తాను ఒక్కొక్కడుగా కన్పించునట్లుగా సాధకులకు వారి, వారి సాధనలనుబట్టి దేవుడు కన్పిస్తూ ఉంటాడు. మిగతావన్నీ ఆతని ఆభాస రూపములే. అందుకే బౌద్ధమతము మానవున్ని కేవలము కీలు బొమ్మగా చేస్తున్నది. లక్ష్యము కానీ, గమ్యముకానీ లేకుండా సాగమంటుంది."

"ఉండి కూడ ఏదీ లేదనుకునేందుకన్న ఒకలక్ష్యాన్ని ఉంచుకొని కోరికలు లేకుండ మానవుడు ప్రపంచములో జీవించాలంటాడు తథాగతుడు. ఇది ఒక రకంగా నీటిలో ఉండి కూడ నీటిని త్రాగని చేప వంటిదే అని మీరు చెప్పేదానికి సారూప్యము".

"అందుకేనయ్యా! సర్వమతములు అక్కడనుండే వచ్చినవి. శివుని ఆజ్ఞలేనిదే చీమ కూడ కుట్టదు. అందుకే దేవుడులేడు అను ఈ పాషండమత ప్రచారాన్ని మానుకో మంటున్నాను. సాంఖ్యులు కూడ మీవలె నిరీశ్వరవాదులే. అందుకే వారిమతము శాశ్వతంగా ఉండలేక పోయింది. మీ బౌద్ధము కూడ అంతే. ఒకప్పుడు ఇదే సమస్య మీద మీ బౌద్ధమత వినాశనం జరుగుతుంది."

"అట్లని మానవులు చైతన్య రహితులుగా, కేవలం నిమిత్త మాత్రులుగా ఉండాలంటారా?"

అమృతపాదార్హతులు ఈ మాటలు పలికినపుడు స్థాలతిష్యుని ముఖము కోపంతో ఎర్రనైంది.

"మీవాదమెప్పుడూ ఇంతే. మీరు ఈ భావనను పోగొట్టుకోరు. ఈ దేశానికి దుస్థితి దాపురించినంతవరకు మీరు మీ ధోరణిని మార్చు కోలేరు."

"స్వామి! మీరు అన్నీ తెలిసినవారు. సిద్ధసంకల్పులు. మీనోట వినాశకరములగు మాటలు రారాదు. క్షణకాలము మనమిర్వురము మతసిద్ధాంతాలను వదలి ఆలోచిస్తే యిద్దరము ప్రపంచశాంతినే కదా కావాలనుకునేది? విశ్వమానవ సౌభాగ్యాన్నే కదా? దానికే కదా మీ జీవిత సర్వస్వాన్ని ధారపోస్తున్నారు?"

"అమృతపాదార్హతులు పలికిన ఈ చివరిమాటలు స్థాలతిష్యుని ఆగ్రహాన్ని కొంత శాంతింప జేశాయి. ఆ మాటల్లోని మృదుత్వమునకు, ఆయనలోని సాధుస్వభావానికీ ముగ్ధుడై తల ఎత్తిచూచాడు.

"పూర్వాశ్రమమున మీ పేరేమి." స్థాలతిష్యుడు

"తెలియదు"- అమృతపాదులు,

"అదేమిటయ్యా! నీపేరు తెలియదంటావు? తెలియదు అనుటకూడ బౌద్ధధర్మములలో ఒకటా? ఇది చాలా ఆశ్చర్యమును కలిగించు విషయము కదా?"

"కావచ్చు. నేనుచెప్పినది నిజము స్వామీ! నాకు గతస్మృతి పోయింది. కారణము తెలియదు. నా తలపై తగిలిన దెబ్బనాకు స్మృతి పోవుటకు కారణ మనుకుంటున్నాను."

"ఆ దెబ్బ ఎందుకు తగిలిందో చెప్పగలవా!"

"చెప్పలేను. నేను పాటలీపుత్రమునకు ఎగువనున్న బౌద్ధ సన్యాసులకు గంగానదిలో దొఱికినానట. వారు నాకు బౌద్ధమత ధర్మములను బోధించి ఈ ఆచార్యపీఠము నధిష్ఠింప జేసిరి."

"దెబ్బ ఎక్కడ తగిలినదో చూపించు?"

అమృతపాదులు తన ఫాలభాగమున కుడివైపును చూపించాడు. అచ్చట ఆదెబ్బ తగులుటకు గుర్తుగా మచ్చలాగా ఉంది. మాని పోయిన ఆ భాగమున కుట్లువేసిన గుర్తులున్నాయి.

"దెబ్బ ఎప్పుడు తగిలిందో చెప్పగలవా?"

"సుమారు పదహారు సంవత్సరాలకు పూర్వము. వైశాఖమాసము. శుద్ధపంచమి నాడు."

"శుక్లపంచమినాడా? వైశాఖమాసములోనా? గంగానదిలోనా?" స్థౌలతిష్యుడు ఈ మాటలను ఆశ్చర్యముతో పలికి బౌద్ధ సన్యాసి వైపు మరియొక సారి తదేక దీక్షతో తిలకించాడు.

"తండ్రీ! నీకేమియు గుర్తులేదా? ఒక చక్కనిచుక్క నీభార్య. ముద్దులమాటగట్టే పంచవర్షముల ప్రాయముగల ఒక బాలిక. నాయనా! ఒక్కసారి నావైపు చూడు నేను గుర్తుకురాలేదా?"

"లేదు. స్వామీ! లేదు. దూరమునుండి రెండుసార్లు మాత్రము నిన్ను తిలకించిన జ్ఞప్తిమాత్రము ఉంది.

అమృతపాదులతో స్థౌలతిష్యుడు సంభాషణను మొదలుపెట్టి నప్పటినుండి అయన హృదయము అమృతపాదులవైపు ఆకర్షిత మగుచూఉంది. ఏదో ఒకఅనుబంధము తమమధ్య ఉందన్న సందేహము క్షణక్షణము కలుగుచూ ఉంది.

అనుబంధంవల్ల జనించే మమత, అనురాగాలు ఆత్మకు సంబంధించినవి. అందుకు సాక్ష్యముకూడ ఆత్మే. ఆత్మ సాక్ష్యానికి జ్ఞానులు ఎక్కువ ప్రాధాన్యము ఇస్తారు. "పదహారేండ్లకు పూర్వము వైశాఖశుద్ధపంచమిన గంగలో దొరికినానట" అను అమృత పాదుల మాటలు స్థౌలతిష్యునికి ఆశ్చర్యాన్ని కల్గించాయి. తన అంతర్వాణి చెప్పుచున్న అనుబంధము నిజమే అనిపించింది. అందువలన ఆయన హృదయము అమితవేగమున పరుగెత్తటం ప్రారంభించింది. పరుగిడుచున్న తనహృదయాన్ని అదుపులోకి తీసుకొనుటకు యోగములోనికి వెళ్ళాడు.

అమృతపాదులకు అది అంతా వింతగా కన్పిస్తూ ఉంది. ఆయన ఊరకే చూస్తూ ఉండిపోయాడు.

స్థౌలతిష్యుడు కొంతసేపటకి కన్నులు తెరచాడు. చిఱునగవులతో బౌద్ధ సన్యాసిని చూస్తూ,

"సరే! వేదములు భగవంతునిచేత చెప్పబడినవి కదా? అవి అనాదియైనవి కూడ కదా? ఆ వేదములను మీరు ఎందుకు ప్రమాణముగా స్వీకరింపరు?"

"వేదములు అనాదివే కావచ్చు. కానీ అవి పౌరుషేయములు. ధర్మ నిర్ణయము చేసుకొనవలసి వచ్చినపుడు మనుష్యుడు తనకు తానే ఆలోచించి ధర్మ నిశ్చయమును చేసుకోవలెను. జ్ఞానవంతుడు బాగా ఆలోచించి ధర్మముతో బాటు సత్యాన్ని కనుక్కోవాలి."

"ఓయీ! వెఱ్ఱివాడా! పరివర్తన అనేది ప్రకృతికి సహజమైన గుణము. ధర్మమును, సత్యమునుగూడ మానవుడు వేదార్థము అధారంగా, పెద్దల అనుభవాలను బట్టి నిర్ణయముగానీ, నిశ్చయము గానీ చేసుకొని తన కర్తవ్యము నిశ్చయించు కోవాలి. దుఃఖము జన్మ పరంపర వలన వస్తుంది. ఆ జన్మ పరంపర విచ్ఛిన్నంకావాలంటే మానవుడు మోక్షసామ్రాజ్యాన్ని అందుకోవాలి. అందుకు వేదములు అనేక మార్గాలు చెప్పుచున్నవి. వేదములు పౌరుషేయములు అను మీ మాటలు నిజముకావు. అవి భగవంతునిచే చెప్పబడినవి. అందువల్ల అవి అపౌరుషేయములు. అనాదియైనవి. వేదములు పౌరుషేయములు అనునవి పాషండమతములు. ఆ మతములు భారతీయులను ఉద్ధరించలేవు. వేదమతమే ఈ చరాచరజగత్తుకు ఆధారము" అని స్థౌలతిష్యుడు తనచేతనున్న మంత్రదండముతో, అమృతపాదులు తన నుదుటి పై చూపిన మచ్చగల ప్రదేశముపై గట్టిగా కొట్టాడు. దెబ్బకు ఆయన క్రింద పడిపోయాడు. గాయమునుండి రక్తము స్రవిస్తూ ఉంది. అంతవరకు దూరంగా ఉండి వారి సంభాషణలను వినుచున్న అమృతపాదుల శిష్యులు వడివడిగా ఆయనవద్దకు వచ్చి చుట్టూ మూగారు. అందులో ఒకరు తన కాషాయ ఉత్తరీయాన్నిచింపి ఆయనతలకు గట్టిగా కట్టుకట్టి భయ విహ్వలులై చూస్తూ నిలబడ్డారు. స్థౌలతిష్యుడు గంటనుమ్రోగించాడు. నలుగురు

శిష్యులు పరుగులమీద వచ్చారు. స్మృతిదప్పి పడిఉన్న అమృత పాదులను ఆశ్రమములోని వైద్యశాలకు తీసుకపోయి మంచముపై పరుండ బెట్టమని ఆదేశించి అమృతపాదుల చుట్టూఉన్న బౌద్ధ సన్యాసులవైపు తీక్షణంగా చూశాడు. తీసుకపోబడుచున్న అమృతపాదుల వైపు కరుణారసపూరితమైన చూపులను ప్రసరింపజేస్తూ 'నాయనా! ఇది నీకొఱకే చేశాను. నీకు గతకాలపు జ్ఞాపకాలు రావాలనే చేశాను' అంటూ పరమేశ్వరసన్నిధానానికి వెళ్ళి అచ్చట యోగములో కూర్చున్నాడు.

అమృతపాదులను వైద్యగృహములోనికి తీసుకొని పోవుటే గాక స్థౌలతిష్యునిశిష్యులు చికిత్సకు కావలసిన ఏర్పాట్లు చేశారు.

ఒక అర్ధఘటిక కాలము గడిచింది. స్థౌలతిష్యుడు కళ్ళుదెరచి పరమేశ్వరునికి మోకరిల్లాడు.

"ప్రభూ! నీలీలలు అతి విచిత్రములు. ఎవరిని ఎప్పుడు కలుపుతావో? ఎప్పుడు ఎందుకు విడదీస్తావో? తెలియదు." అనిపలికి వైద్యశాలకు వెళ్ళాడు.

స్థౌలతిష్యుని ఆదేశముతో శిష్యులు రెండుపెట్టెలను అక్కడ ఉంచి ఉన్నారు. ఒక దానినితెరచి అందలి పాత్రలోని ఒకతైలమును తీసి అమృతపాదులతలపై రక్తముకారు ప్రదేశములో పూశాడు. రక్తము కరిగిపోయి గాయము శుభ్రంగా కన్పించింది. అదేపెట్టెలో మరియొక పాత్రలో గల తైలమును తన రెండుచేతులకు పులుము కున్నాడు.

ఎప్పుడైతే తన తలపై దెబ్బతగిలిందో అప్పుడే అమృతపాదులు లంబికాయోగములోనికి వెళ్ళిపోయాడు. అందువలన రక్తము ప్రవిం చుట శీఘ్రముగా ఆగిపోయింది. గాయమువద్ద మాత్రమే కొద్దిగా కారుచూఉంది. లంబికాయోగమున నున్న వారికి సర్వము శూన్యంగా కన్పిస్తుంది. అతని జ్ఞానము అతనిలో లయమౌతుంది. అతడు బ్రతికియు చచ్చిన వానితో సమానమే.

మఱియొక తైలమును తీసుకొని స్థౌలతిష్యుడు పెట్టెలోనున్న శస్త్రములపై పోశాడు. తదుపరి అందుండి ఒక శస్త్రమును తీసుకొని మంత్రములను పలుకుచూ అతని పుఱ్ఱెఎముకను చేదించి ప్రక్కన ఉంచాడు. లోపల సూక్ష్మాతి సూక్ష్మములైన నాళములు ఎన్నో ఉన్నవి. స్థౌలతిష్యుడు వాటిని నిశితంగా పరిశీలించాడు. ఆనాళములలో ఒకచోట కొన్నితెగి అచ్చట రక్తము గడ్డకట్టి ఉంది. గడ్డకట్టిన ఆ

భాగమును తొలగించి, నాళములన్నింటినీ సమంగా సర్ది, శుభ్రము చేసి ముందు తొలగించిన ఎముకను తిరిగి అందులో పెట్టి, శరీరమును కుట్టి, అకుట్లపై ఒక తైలమును పూశాడు. అతనిని తిరిగి మరియొక మంచముపై పరుండబెట్టి ఒక తైలమును అతని హృదయముపై నెమ్మదిగా పూయమని శిష్యులకు ఆదేశించాడు. గంగానదిలోని జలములో స్నానము చేసి వచ్చి అమృతపాదులవద్ద జింకచర్మముపై కూర్చుండి ప్రణవమంత్రోపాసనను ఆరంభించాడు.

ఉపాసనలో ఆయన తురీయ (చివరి) స్థితిని చేరుకున్నాడు. ఆయన ఆత్మ దివ్యపథములలో విహరించడం మొదలు పెట్టింది. అప్పుడు ఆయనకు సృష్టి ఏమీ కన్పించలేదు. లోకములు గోచరించలేదు. విశ్వమంతా తానే అయ్యాడు. సత్యము, ధర్మము జ్ఞానము, సర్వమూ ఆయనే. ఇంతలో సాయంకాలమైంది.

లంబికాయోగమునఉన్న అమృతపాదులలో కదలిక ప్రారంభమైంది. ఆయన దృష్టి పథములో లీలగా ఒక సంఘటన కదల జొచ్చింది.

అది వైశాఖశుద్ధపంచమి. కాశీప్రదేశము. గంగానదిలో పడవలో తాను వెళ్ళుచూ ఉన్నాడు. తనతో పాటు తనతండ్రి. తనతల్లి. తనప్రక్కన నవోఢయైన తనభార్య. భార్య ఒడిలో పంచవర్షముల ప్రాయముగల ఒకబాలిక. ఒక కుదుపు వచ్చింది.పడవ మునిగి పోయింది.

ఇంతలో ఆయనకు పూర్తిస్పృహ కలిగింది. కన్నులు తెరిచి చూశాడు. అప్పటికి స్థూలతిష్యుడూ మంత్రోపాసన నుండి కన్నులు తెఱిచాడు.

అమృతపాదుల స్థితిని గమనించి ఒక చూర్ణమును తేనెలో రంగరించి ఆయనచే తినిపించాడు.

"తండ్రీ! నీ పేరు నందిదత్తుడు కదా?" ప్రశ్నించాడు స్థూలతిష్యుడు.

"అవును" అని ఆయన తల ఊపాడు.

నీ భార్య పేరు గుర్తు ఉన్నదా!

"అపరాజిత".

"అయిన నేనెవరు!"

"నా పితృపాదులు."

ఆ మాటలు విన్న స్థూలతిష్యుని కన్నుల నీరు కారింది. క్షణకాలము మౌనంగా ఉన్నాడు.

"తండ్రీ! ఇక విశ్రాంతి తీసుకో. అన్ని విషయములు తదుపరి మాట్లాడు కొందాము."

"పితృదేవా! ఆనాడా పడవలో మునిగిపోయిన వారందరూ క్షేమమా?"

"ప్రవాహవేగమున కొట్టుకొనిపోతూ, ప్రమాదస్థలానికి అనతి దూరాన నేను గట్టు త్రొక్కగలిగాను. ప్రవాహవేగములో కొట్టుకొనిపోయిన మీతల్లి జాడ తెలియలేదు. ఒడిలోనున్న బిడ్డను హృదయానికి అదిమి పట్టుకొని నీభార్య జాలర్లసహాయముతో బైటపడింది. దాదాపు మూడుసంవత్సరాలు జీవించిన ఆమె నీమీది బెంగతో మంచము పట్టి మరణించింది. అప్పటినుండీ నీ బిడ్డను తల్లీ తండ్రి అన్నీ నేనై పెంచాను."

"అంటే విషకన్య నాకూతురా?" ప్రశ్నించాడు అమృతపాదులు గాద్గదిక స్వరముతో.

"అవును"

"అయితే ఆమె ఎక్కడ?"

"ఆవిషయమంతా తరువాత వివరిస్తాను. కొంతసేపు విశ్రాంతి తీసుకో."

స్థూలతిష్యుడు ఇచ్చిన ఔషధప్రభావముతో అమృతపాదులకు నిద్రపట్టింది.

"పరమేశ్వరా! నీలీలలు ఎంత విచిత్రములయ్యా? తండ్రి ఆర్షమతమునకు ఆయువు పట్టు. కొడుకు బౌద్ధమతానికి ఆచార్య స్థానీయుడు.వేదమతధర్మాలను ఉగ్గుపాలతో రంగరించి పోసిపెంచిన శరీరము ఇప్పుడు బౌద్ధమతధర్మాలను నరనరముల జీర్ణించుకొని, రూపమెత్తిన బౌద్ధధర్మంగా నిలిచింది. వేదములు. వేదాంగములు. ఉపనిషత్తులు. ఇవే అననేల సర్వమైన వేదవిజ్ఞానాన్నంతా ఆపోశనపట్టిన పరమబ్రాహ్మణ్యుడు తండ్రి. బౌద్ధధర్మాలను సర్వమూ ఆకళింపజేసుకొని ఆచార్యుడు, కులపతి, సంఘారామాధ్యక్షుడునై సర్వభారతీయ బౌద్ధమతానికి ఏడుగడగా నిలిచాడు కొడుకు. ఒకే శరీరమున రెండువిభిన్న

మతధర్మములు మేళవించినవి. తండ్రి కొడిగట్టనున్న వేదమతోద్ధరణకు సర్వమును త్యాగము చేసి సర్వవిధాల ప్రయత్నిస్తున్నాడు. కొడుకు వేదమతాన్ని అణచి, బౌద్ధమతాన్ని దిగంతాలపర్యంతం వ్యాపింప జేస్తున్నాడు. ఇతడు పవిత్రుడా? అపవిత్రుడా? ఏమో వీటికి సమాధానం నీవే చెప్పాలి ప్రభూ!" అంటూ అటునుండి ఆశ్రమంవైపు వెళ్ళిపోయాడు స్థూలతిష్యుడు.



అప్పటి ఉత్తరభారతరాజ్యాలలో మగధసామ్రాజ్యమే గొప్పది. భారత వర్షానికి కొన్నాళ్ళు అయోధ్య, కొన్నాళ్ళు హస్తినాపురము ముఖ్య పట్టణాలుగా ఉన్నట్లే, ఈ కథాకాలము నాటికి పాటలీపుత్రము రాజధాని.

"మౌర్యరాజులలో చిట్టచివరివాడైన బృహద్రధుని వధించి, పుష్య మిత్రశృంగుడు మగధసామ్రాజ్యసింహపీఠమును అధిరోహించాడు. పేరుకు మాత్రమే అతడు రాజు. రాజ్యచక్రాన్ని త్రిప్పేది కాణ్వాయనులైన బ్రాహ్మణమంత్రులే. వారిలో కట్టకడపటివాడైన సుశర్మ తానే రాజునని కూడ ప్రకటించుకొన్నాడు. శుంగవంశీయులైన సేనానాయకులు అందుకు అంగీకరించలేదు. అందువలన మగధసామ్రాజ్యములో మాండలీకులకు అప్పుడప్పుడు యుద్ధములు జరుగుచూ ఉన్నాయి. శుంగవంశీయులైన సేనానాయకులకు, కాణ్వాయనులకు కూడ సమరములు సాగుచూనే ఉన్నాయి. అందువలన మగధసామ్రాజ్యము అల్లకల్లోలంగా ఉంది. రోజు రోజుకూ బలహీనమవుచూ ఉంది. భారత వర్షానికి అంతకూ ఆయువుపట్టువుగా నున్న మగధ సామ్రాజ్యము అంతర్గత కలహాలతో, ఆంతరంగికవిభేదాలతో ఉండడము సర్వ భారతదేశానికి మంచిదికాదు.

ఈ విషయాన్ని చారుగుప్తుడు శ్రీముఖ శాతవాహనునికి చెప్పాడు - ధర్మపథానురక్తులై, మతవిద్వేషానికీ, మత పక్షపాతానికీ ఏమాత్రమూ తావులేకుండా పరిపాలనాదక్షులుగా ప్రజాప్రియులుగా, సాత్వికజనశేఖరులుగా పేరుపొంది, దిగంత విశ్రాంత యశోవిశాలురైన తమ ఏలుబడికై మగధప్రజలు ఎదురు చూస్తున్నారు. ప్రభూ! అంటూ చారుగుప్తుడు శ్రీముఖశాతవాహనప్రభువును ఉత్సాహ పరచాడు, "ఆంధ్రభూమికే కాదు. సర్వభూమండలానికి ఆంధ్రులు సమ్రాట్టులు కావాలి." అనికూడ చెప్పి చారుగుప్తుడు మగధపై దండువెడలుటకు ప్రభువును ఒప్పించాడు.

మహారాజు మాళవమున నున్న సైనికులను మూడుభాగాలుగా విభజించాడు. పాటలీపుత్రముపై వెడలుటకు రణభేరిని మ్రోగించాడు.

దీర్ఘకాలజ్ఞుడు, దేశభక్తిపరాయణుడు, యుద్ధవిద్యానిపుణుడు చారుగుప్తుడు అందుకు అనువుగా వ్యూహాన్ని రచించాడు.

ఆంధ్రసామ్రాజ్యాన్ని కబలించాలి. మహాప్రవాహవేగంగా విస్తరిస్తున్న బౌద్ధమతప్రతాపానికి ఆనకట్ట కట్టాలి. అని భావిస్తున్న సుశర్మ తనపై ఆంధ్రసేనలు ఎత్తిరావడము మంచి అవకాశంగా భావించాడు. తానై ఆంధ్రభూమిపై పోరునడిపి, ఆంధ్రుల నోడించుటకంటే తనపై వస్తున్న ఆంధ్రరాజును నిర్జించడమే సులువని ఆయన తలంచాడు. అందువలన పాటలీపుత్రకోటలను, గోడలను బాగుచేయించాడు. పాటలీపుత్రానికి ఒకవైపున గంగానది ఉంది. అది జీవనది. ఎప్పుడూ పాఱుతూ ఉంటుంది. మిగిలిన మూడుదిశల్లో లోతైన కందకాలు. వాటిలో నీరు ఎప్పుడూ నిండుగా ఉంటుంది. కోటగోడలు ఆకాశము తాకుచున్నట్లుగా ఉంటాయి. కోటచుట్టూ అయిదువందలడెబ్బయి బురుజులు. ఎనిమిది చిన్నకోటలు. గంగానదివైపు ఇరవైగోపురాలు. తక్కిన భూభాగములో నలభైనాలుగు గోపురమహాద్వారాలు ఉన్నాయి. నగరకుడ్యముల చుట్టూ కట్టిన ఏడుకోటలకు మహాకుడ్యము ఒకదానిని కలిపి నిర్మించారు. శోణనది నుండి ఒకపాయను తీసుకవచ్చి పాటలీపుత్రానికి దిగువన గంగానదిలో కలిపారు.

కానీ, సుశర్మ, ఆంధ్రులు పాటలీపుత్రముపై దాడి చేస్తారని కలలోకూడ ఊహించలేదు. అందువలన తనవద్దనున్న లక్షాయాభైవేల సైన్యాన్ని మాళవరాజుకు సహాయంగా పంపాడు. ఆ సైన్యము రావడానికి వీలులేదు. తనచుట్టూఉన్న దేశాలవారందరు బౌద్ధులు. లిచ్ఛవులు కూడ బౌద్ధులే. అందువలన వారినుండి సహాయము లభిస్తుందన్న ఆశలేదు. వారణాసికీ, నేపాలానికీ వార్తలు పంపగా అక్కడి నుండి ముప్పయివేల సైన్యము వచ్చి చేరింది. పాటలీపుత్రాన్ని రక్షిస్తున్న లక్షాపదివేల సైన్యానికి తోడుగా మాళవసేనలు లక్ష, శివస్వాతి అరువది వేలు, పుళిందులు వచ్చి తన సేనలతో చేరుతాయి కాబట్టి సులభంగా ఆంధ్రులను ఓడించ వచ్చును అనుకుంటున్నాడు సుశర్మ. ఊహించడమే కాదు. జరిగి తీరుతుందన్న నమ్మికతో ఆయన పాటలీపుత్రములో విజయయజ్ఞములు, భగవదారాధనలు చేయించాడు.

చారుగుప్తుడు లక్షలకొలది తాటియాకులను తెప్పించి, యాభైవేల శిబిరాలను నిర్మించాడు. మట్టికుండలను తెప్పించి శిబిరాలలో ఉంచాడు. పదివేల ఆవులను, ముప్పయివేల మహిషములను కూడ ఆయన తెప్పించాడు.వర్తకులు వచ్చి అంగళ్ళు పెట్టుకొన్నారు. మూడు రోజులలో ఆంధ్రసైన్యములు పాటలీపుత్రాన్ని ముట్టడించాయి.

"ప్రభూ! మనము పాటలీపుత్రాన్ని ఒక్క వడిగా దాకాలి. అందుకు తగిన వ్యూహాన్ని రచించుటకు నాకు పదిరోజులు గడువు కావాలి. ఈలోగా సర్వసైన్యాధ్యక్షులైన అచీర్ణులవారు సేనలకు అనుకున్నది అనుకున్నట్లుగా ఒక్క బిగిన తాకుటకు తగినవిధంగా శిక్షణ ఇవ్వాలి. అని చారుగుప్తులవారు మహారాజుకు విన్నవించారు.

భద్రదంతావలాన్నిఎక్కి యువరాజు శ్రీకృష్ణశాతవాహనులు పాటలీపుత్రమువైపు వేట నెపంతో పయనియస్తున్నారు. ఆయనకు ముందు విషవైద్యుడు. వెనుక మంత్రవేత్త. అంగరక్షకులు అశ్వారోహకులై అన్ని దిశలా సర్వజాగ్రత్తలతో నడుస్తున్నారు.

ముందుకు సాగుచున్న భద్రదంతావళము ఒకచోట నిలబడి పోయింది. ఎదురుగా ఒక శ్వేతనాగు పడగఎత్తి ఆడుచూ, బుసలుకొట్టూ దారికి అడ్డంగా ఉంది. కొంతసేపు అలా ఆడి ముందుకు సాగింది. ఆవిధంగా ముందుకుసాగిన ఆ నాగము కొంతదూరము వెళ్ళి వెనుకకు తిరిగిచూస్తూ నిలబడింది. అది చూచిన మాంత్రికుడు "ప్రభూ! ఏలిన వారిని తమవెంట ఎక్కడికో రమ్మంటూంది" అన్నాడు.

ఆశ్చర్యచకితుడై యువరాజు ఆ నాగము వెంట దంతావళాన్ని నడిపించాడు. రెండు యోజనముల దూరము పయనించాడు. అదంతా దుర్గమారణ్యము. మృత్యుదేవత విహరించే భయంకరభూమిగా ఉంది.

దంతావళము ఇకముందుకు సాగక భయపడుచూ ఆగిపోయింది. పరివారము నిలబడి పోయింది. పైనున్న యువరాజు వివశుడయ్యాడు.

పరిస్థితిని గమనించిన విషవైద్యుడు, మంత్రవేత్త వడివడిగా క్రింది దిగారు. విషవైద్యుడు తనవద్దనున్న పెట్టెనుండి కొన్ని చూర్ణములను తీసికొని వాటిని ఒక కరండము (బరిణె)లో పోసి చెకుముకిని వెలిగించి, ఆ చూర్ణమును అంటించాడు. కరండము నుండి పొగలు గుబురు గుబురుగా వెలుపలికి వచ్చాయి. ఆ కరండమును చేతపట్టుకొని

విషవైద్యుడు ముళ్లపొదలలో మెల్లగా దారిచేసుకొంటూ దంతావళం దగ్గరకు వచ్చాడు. ఆ పొగల ప్రభావంవల్ల యువరాజుకూ, ఆయన పరివారానికీ తుమ్ములు విరివిగావచ్చాయి. వివశుడైన యువరాజు తేరుకొని భద్రదంతావళము మీదనుండి క్రిందికిదిగాడు. ఇంతలో దూరము నుండి ఒక పాములవాడు 'హూ' అని కేక వేసి "దొరా! తమరు ఉన్నది భయంకరవిషవాయువులు వచ్చే ప్రదేశము. ఆ విషవాయువులకు కారణమైన ఆ నాగరాజునివాసము ఇక్కడికి సమీపములోనే ఉండవచ్చు. లేకుంటే ఇంత చావు గాలులు రావు. మంటలను మండించి, పొగలను దట్టంగా వేయండి. మేము అంతా అక్కడికే వస్తున్నాము" అని కేక వేశాడు.

విషవైద్యుడు తన వద్దనున్న పెట్టెలో నుండి "అమృతద్రావకము" అను ఒక మందును తీసి ఒక సన్నని తెల్లని వస్త్రముపై పోసి దానిని అందరి ముక్కులకు కట్టి తానూ కట్టుకొన్నాడు.

అప్పటికి మిట్టమధ్యాహ్న మైంది. దప్పికతో వారి నాలుకలు ఎండిపోతూ ఉన్నాయి. విషవైద్యుడు అతి మధురము, ఇప్ప తీగెలతో తయారు చేసిన మాత్రలను వారందరికీ ఇచ్చి మ్రింగించాడు. వారికి దప్పిక తగ్గింది.

ఎదురుగా స్పృహ తప్పి దిగంబరిగా పడియున్న ఒక దివ్య సుందరి. శ్వేతనాగు ఆమెచుట్టూ తిరుగుచూ త్రొక్కిట పడుచూ యువరాజు వైపు చూస్తూ ఉంది.

విషవైద్యుడు ఆ సుందరిని దూరము నుండి ఒక్క క్షణం నిశితంగా పరిశీలించాడు.

"ప్రభూ! ఈ బాలిక బ్రతికే ఉంది. వెంటనే చికిత్స జరుగక పోతే మృత్యువు ఈమెను కబళించవచ్చు. కానీ-కానీ-ప్రభూ! అంటూ యువరాజువైపు చూచి ఒక్కఅడుగు కూడ మీరు ముందుకు వేయరాదు. ఈ బాలిక సమ్ముఖము మృత్యుదేవతా సన్నిధానం" అంటూ ఆతురతతో చెప్పాడు.

"మీరు రెండూ చెప్పుచున్నారు. కర్తవ్య మేమిటో వెంటనే చెప్పండి. లేదా నేను ముందుకుదూకి ఈ బాలికను రక్షిస్తాను"- అని యువరాజు తనవద్దనున్న ఒక సైనికుని చేతిలోని గొడ్డలిని తీసుకొని ముందుకు అడుగు వేయబోయాడు.

విషవైద్యుడు ప్రభువుకు అడ్డంగా నిలబడి, "మహారాజా! అంతపని చేయకండి. మీరు ఇక ఒక అడుగు ముందుకు వేసితిరా తథాగతుని పై ఆన. తొందర పడకండి. నేను ఇంకొక మహావిషమును సేవిస్తాను. ఈ విషము ఆ విషమునకు విరుగుడు. ఈ విషమును తిన్నవారు మూడు దినముల తర్వాత వేయి గజనిమ్మపండ్లను తినాలి. నేను, ఈ పాములవాడు ఈ బాలికవద్దకు వెళ్ళుతాము. మీరంతా ఇక్కడే నిలబడి ఉండండి" అన్నాడు.

విషవైద్యుడు ఆ బాలికనాడిని పరీక్షించాడు. నాడి బలిష్ఠంగా ఉంది. ఈ స్థితిలోకూడ అంతబలిష్ఠంగా నాడి ఉన్నందుకు ఆశ్చర్యపోయాడు. వైద్యుడు తన వద్దనున్న తోలుసంచిలో నుంచి ఒక గజనిమ్మపండును తీసి, దానిరసమును ఆ బాలికపెదవులపై పిండాడు. ఆ రసబిందువుల తియ్యదనానికి ఆమెనోరు చప్పరించింది. నాలుకను ముందుకు సాచింది. విషవైద్యుడు తన వద్దగల ఒక నారింజపండును తీసి దానిరసమును ఆమె నాలుకపై పిండాడు. ఆమెలో చలనం కలిగింది " దాహము" "దాహము" అంటూ ఆ బాలిక లేవబోయింది.

"తల్లీ! కదలకుము. నీకు ప్రాణాపాయము ఏమీ లేదు. నీకు కావలసిన వన్నీ మేము సమకూర్చుతాము" అని పలికి పాములవాడు తన తలపాగను తలగడగా పెట్టాడు. తన కంబలిని ప్రక్కగా అమర్చాడు.

విషవైద్యుడు తన వద్ద గల తోలుతిత్తినుండి నీరు తీసికొని ఆమె కాళ్ళు చేతులు శుభ్రంగాతుడిచి ముఖాన్నిశుభ్రముచేసి కొంచెము, కొంచెముగా ఆమెతో నీరు త్రాగించాడు.

శ్రీ కృష్ణశాతవాహనుడు చేష్టలుడిగి ఆ బాలికవైపు తదేకదృష్టితో చూస్తున్నాడు.

ఆమెది జగన్మోహనాకారము. కానీ భయంకరము. కన్నులు కాంతి పుంజములు. దీర్ఘములైన ఆమెకురులు శరదృతువు నందలి పున్నమినాటి వినిర్మల వినీల గగన సదృశాలు. ఆమె చూపులలో ఆయన చూపులు కలిశాయి. ఆయన భావనలు ఆమె తనువు నంతా తాకి, తాకి తిరిగి ఆయనవద్దకే వచ్చాయి. తన నడుముకు కట్టుకొన్న దుకూలాన్ని తీసి ఆమెపై విసిరి వేశాడు. ఆమె నాగలోకవాసినియా? లేక ఈ గిరినాగినియా? అనుకుంటున్నాడు.

"ప్రభూ! ఈ బాలికలో సర్వవిషములూ జీర్ణించి ఉన్నాయి. అవే ఇప్పుడు విజృంభించి మనందరను చీకాకు పరచాయి" అని మనవి చేశాడు విషవైద్యుడు.

"అయితే ఈ బాలిక ఇంకా ఎట్లు బ్రతికి ఉంది? అమెను ఇట్లే బ్రతికించే ఉపాయము లేదా? అంటూ పలికి శ్రీకృష్ణశాతవాహనుడు తన ఒఱనున్న ఖడ్గాన్ని తీసుకొని ఆ బాలికను ఈ స్థితికి తెచ్చిన ఆదుర్మార్గులను నూరుతునకలుగా ఖండించివేస్తానని" అగ్ర హెూదగ్రంగా పలికాడు!

"మహారాజా! ఆగ్రహించకండి. శాంతంవహించండి. ఈ బాలికకు ప్రాణాపాయము ఏమీ లేదు". అన్నాడు ప్రక్కనున్న మంత్రవేత్త.

"మీ మాటలు చాలా విచిత్రంగా ఉంటున్నాయి. మనందరికీ ప్రాణాపాయాన్నికలిగించే విషాలను ఈ బాలికచే మ్రింగించారని ఇప్పుడే అన్నారు కదా? అయితే ఆమె ఎట్లు బ్రతికింది? మీ మాటలను ఎలానమ్మాలి?"

"మహారాజా! చిత్రమైన విషయమదే. కారణము చెప్పలేను. కానీ మేము చెప్పింది నిజము. ఎంతటివిషాన్నైనా ఈమె హరించు కోగలదు."

"'ఏమో మీ ఇద్దరి మాటలు వింటూంటే నాకు మతిపోతూ ఉంది.ఏమైనా కానీ ఈ బాలిక జీవించాలి. ఈ బాలిక చనిపోయెనా? ఈ బొందిలో ప్రాణాలుండవు. సర్వదేవతల సాక్షిగా చెప్పుచున్నాను."

"ఆ మాటలకు ఆ వైద్యద్వయం ఆశ్చర్యపోతూ", "ప్రభూ! ఈ విషగాలుల ప్రభావము వలన మీ నరములు స్తంభించి పోయాయి. తాము వెళ్ళి విశ్రాంతి తీసుకోండి."

"విశ్రాంతియా? నాకిప్పటినుండి విశ్రాంతేలేదు. విధి ఉద్దేశ్యమేమో చెప్పలేను. ఈ బాలికతో నాజీవితము ముడివేసుకుంది. ఈమే నా ప్రాణము. ఈమే నా సర్వస్వము. ఈమె జీవించకపోతే నేను గూడ జీవించలేను."

ఆ మాటలు ఆ వైద్యులిర్వురికీ మరింతగా భయమును కలి గించాయి. విషవైద్యుడు విషబాల వద్దకు వెళ్ళి కూర్చొని ఆమె నవనాడులను, ఉచ్ఛ్వాస నిశ్వాసాలను గమనించి అక్కడ నుండి లేచి యువరాజు వైపుచూస్తూ,

"ప్రభూ! ఈమె బ్రతికే ఉంది. ఇకముందు కూడ బ్రతుకుతుంది. ఈమెలో మహాసర్పనాడి దేహమంతా పరివ్యాప్తమై ఉంది. అయినా ఈమెలో బలహీనత తప్ప ఇతర దోషము ఏదీలేదు. మహావిషములను జీర్ణించుకొన్న ఈ బాలిక కథల్లో, విషశాస్త్రాల్లో చెప్పబడిన విషకన్య".

"విషకన్యయా!"

"మహారాజా! చాణక్యుడు పర్వతకునిపై విషకన్యా ప్రయోగము చేసెనను విషయమును మీరు వినలేదా?"

"అయితే, ఈ బాలికను ఇక్కడ ఎందుకు పడవేసి ఉన్నట్లు?"

"ఈమెను అంతమొందించాలనే ఉద్దేశ్యముతోనే."

ఇంతలో జ్యోతిష్కుడు అక్కడికి వచ్చాడు. ఆయన నోటిలోనే ఏదో గుణించి,

"యువరాజా! ఈమె ఉత్తమవంశసంజాత. పరమోత్కృష్టమైన జాతక మీామెది. ఈమె మహారాణి ఔతుంది. ఈస్థితిలో ఈమె రెండు మూడు సంవత్సరాలుండవచ్చు."

ఆ మాటలు శ్రీకృష్ణశాతవాహనునికి ఆనందాన్ని కలిగించాయి,

"ప్రభూ! నా అనుమతి లేకుండా రెండు నెలలు ఈ బాలిక వద్దకు రానని తమరు మాట ఇస్తే ఈమెను బ్రతికించు బాధ్యతను స్వీకరిస్తాను" అన్నాడు విషవైద్యుడు.

"అమ్మా! సువర్ణశ్రీ వారు వస్తున్నారు" - కావలి భటుడు.

ఇంటిచావడిలో కూర్చొని ముత్తవముక్తావళీదేవితో మాట్లాడుచూ ఉన్న హిమబిందు ఆ మాటలు విని బిర బిరా లోనికి పోయింది.

"నాయనా! చూచితివా? ఇదీ వరస. నీవు వస్తున్నట్లు తెలియుటతోనే కోపముతో హిమబిందు లోనికి వెళ్ళింది. ఏదో పరధ్యానంలో ఉన్నట్లు, ఏదో మూగవేదనతో బాధ పడుచున్నట్లు ఉంటూంది." సువర్ణశ్రీతో ముక్తావళీదేవి చెప్పింది.

"అవ్వా! నేను మళ్ళీవస్తాను."

"నాయనా! లోపలికివెళ్ళి ఆమెను పలుకరించి వెళ్ళు. వర్షాగమనానికై ఎదురుచూచే చాతకపక్షివలె ఆమె నీ రాకకు ఎదురుచూస్తూ ఉంటుంది. లేకుంటే ఈ రోజంతా నీరు కూడ ముట్టదు."

సువర్ణశ్రీ లోనికి వెళ్ళాడు.

హిమబిందు చావడిలో ఒక మూల కూర్చొని వెక్కి వెక్కి ఏడ్చుచూ ఉంది.

"హిమబిందుకుమారీ!" పిలిచాడు సువర్ణశ్రీ. పలుకలేదు.

ఆమె వెక్కి వెక్కి ఏడ్చుచూనే ఉంది.

"అమ్మాయిగారూ! ఎందుకీ ఏడుపు. మీకు వచ్చిన కష్టమేదో చెప్పరూ" అంటూ అనునయంగా అడిగాడు సువర్ణశ్రీ.

"ఏమని చెప్పను? మిమ్ములను ఎప్పుడూ ఇక్కడే ఉండమని చెప్పనా? మీకు దూరంగాఉండి జీవించలేనని చెప్పనా? మీరు, మీరు అంటూ దూరంగా ఉంటున్నారు. ఇది భరించలేను అని చెప్పనా? ప్రేయసి మనస్సును తెలుసుకోలేని మీతో నేను ఏమని చెప్పను."

"హిమబిందూ! విధి ఘటనను ఎవరూ తప్పించలేరు. పెద్దల ఆలోచనలు వేరుగా ఉన్నపుడు వారి ఆలోచనలకు విరుద్ధంగా ప్రవర్తించి కన్నవారల మనస్సును కష్టపెట్టడం పిల్లలకు భావ్యముకాదు. ఇక ఇక్కడ మీరుండడము తగదు. మీ తండ్రిగారివద్దకు పంపే ఏర్పాటు చేస్తాను."

"ఆ పని మీరెందుకు చేయాలి? సోమదత్తులవారున్నారు కదా?" పైటచెఱగుతో ముఖాన్నికప్పుకొని కంటనీరుపెట్టూ పలికింది హిమబిందు.

"అయినా నాతో మీకేమి పనిఉంది. ఇక వెళ్ళుచున్నాను. నా ముఖాన్ని చూపి మీ మనస్సును క్షోభ పెట్టలేను",కోపంతో సువర్ణశ్రీ అన్నాడు.

"మంచిది. వెళ్ళండి. అదే నిజమైతే ఈ జన్మలో ప్రాణంతో ఉన్న హిమబిందును చూడలేరు". కోపశోకాలు రెండూ ముఖంపై కొట్టవచ్చినట్లు కన్పిస్తుండగా పలికింది హిమబిందు.

ఈ హిమబిందు ఆంధ్రశాతవాహనమహాసామ్రాజ్యానికి కాబోయే మహారాణి. తానీమెను శిల్పియై మనోజ్ఞ రూపములో ఈమె రూపాన్ని గండరించు కొని ఆరాధించు కోవాలి. యుద్ధవీరుడై ఆంధ్ర శాతవాహనసామ్రాజ్యాన్ని విస్తరింప చేయాలి. ఆ సామ్రాజ్యాన్ని భద్రంగా కాపాడు కోవాలి. హిమబిందు, శ్రీకృష్ణశాతవాహనుల కల్యాణాన్ని కన్నులారా వీక్షించి, ముగ్ధమోహనమైన ఆ జంటను చూచి, తన జన్మను తరింప జేసుకోవాలి. అంతేగానీ ఆంధ్రమహాసామ్రాజ్యానికి రాణికానున్న ఈమెను వివాహమాడి ఈమె ఉజ్జ్వల భవిష్యత్తుకు భంగము కలిగించరాదు. నిజమైనప్రేమ ఎప్పుడూ త్యాగాన్నే కోరుతుంది. స్వార్థానికి దూరంగా ఉంటుంది. అందువలన ఈమెను తండ్రి వద్దకు పంపుటే ఇక తానుగా చేయవలసింది. అని ఆలోచించుకుంటూ మఱియొక నాడు సువర్ణశ్రీ చారుగుప్తుల వారి మందిరానికి వెళ్ళాడు.

"సువర్ణా! మా ప్రయాణము ఎప్పుడు?" ప్రశ్నించింది ముక్తావళీదేవి.

"నేనెక్కడికీ పోను. ఈ ధాన్యకటకములోనే ఉంటాను. బిక్షుకురాలినై ఇక్కడే జీవిస్తాను"-హిమబిందు.

"హిమబిందూ! తొందరపడి నిర్ణయము తీసుకోకు. ఈవిధంగా వేగిరపాటున మాట్లాడుట మంచిదికాదు. అనుకున్నది అనుకున్నట్లు కొద్దిమంది జీవితాలలోనే జరుగుతుంది. కొందరికి అనుకున్న దానికి విరుద్ధంగా జరుగుతుంది. అంతమాత్రాన నిరుత్సాహపడడం, వైరాగ్య స్థితిలో ఆలోచించడం అంత మంచిది కాదు. జీవితమాధుర్యాన్ని చవిచూడకుండా విరాగి కావడం నీకు తగదు. ఈమాట తండ్రిగారు వింటే ఆయన ముదుసలిగుండె ఏమౌతుందో ఒకక్షణం ఆలోచించు. రెండురోజులలో కొంతసైన్యము ఇక్కడికి రావచ్చు. వారిని తోడుగాఇచ్చి మిమ్ములను పాటలీపుత్రంలోని మీ తండ్రిగారి వద్దకు పంపుతాను."

"నీవు పంపేది నన్నుకాదు. నా శవాన్ని."

"హిమబిందూ! ఎంత మాటంటివి. బుద్ధదేవుని కృపవల్ల మీకు ఎటువంటి విపత్తూ రాదు."

"సువర్ణా! ఈ పిల్లతో నేను చచ్చిపోతున్నానయ్యా! ప్రొద్దస్తమానము దీనికి నీస్మరణే తప్ప వేరు చింతన ఉండదు. ఏవేవో ఊహించుకుంటూ నీవు ఎప్పుడు వస్తావా? అని ద్వారంవైపు చూస్తూ తనలో తాను ఏదో

సనుగుకొంటూ ఉంటుంది. నాకేమీ పాలుపోవుట లేదు. చారుగుప్తుల వారు దీన్ని మహారాణిని చేయాలని ఆశలమేడలు కట్టుకొంటున్నారు" -ముక్తావళీదేవి.

"మీరు నన్ను ఎక్కడికీ పంపవద్దు. మీరు, మీరు అంటూ నన్ను మరింతగా వేదిస్తూన్నారు. ఈ విధమైన క్షోభకు గురిచేయడానికి నేను మీకేమి పాపము చేశాను. ప్రేమించడమేతప్పా? మీకు శతకోటి నమస్కారాలు. నాదారి నేను చూచుకొంటాను."

సువర్ణశ్రీ కన్నులనిండా నీరు గిర, గిరా తిరిగింది. కుప్పకూలిపోయాడు. ప్రభుభక్తితో పునీతమగుచున్న వంశము మాది. ఆ ప్రభువులకు కాబోయే కోడలు. ఆంధ్రమహాసామ్రాజ్య భావి సామ్రాజ్ఞిని సామాన్యవీరుడైన తాను పెళ్ళాడుట న్యాయమా? ఈ దేశ శ్రేయస్సుకు, ఈ ఆంధ్రదేశ ప్రాభవాన్ని, వైభవాన్ని హిమాలయోత్తుంగ శిఖర సన్నిభము చేయుటకై తన ధనాన్నీ, యావజ్జీవితాన్నీ ధారపోస్తున్న త్యాగమూర్తి చారుగుప్తుల వారికి ఈ దేశపౌరునిగా తాను చెప్పవలసిన కృతజ్ఞత ఇదేనా? ఇంతకన్నా కృతఘ్నత ఉంటుందా? కృతఘ్నుని మాంసాన్ని కుక్కలు కూడ ముట్టవుకదా? తన శరీరములోని ప్రతి రక్తపుబొట్టును ఈ దేశసేవకై వెచ్చిస్తూ, స్వహస్తాలతో ఆంధ్రశాతవాహన సామ్రాజ్యమనే భవంతిని నిర్మించి అహర్నిశముశ్రమించి అనేక అంతస్తులుగా, అపూర్వశోభాయమానంగా తీర్చిదిద్ది, సర్వభారత వర్షానికీ శాతవాహనులను సమ్రాట్టులుగా చేయుటకు కంకణం కట్టుకొన్న చారుగుప్తుల వారి బంగారు కలలను, కల్లలుచేసి ఆయన మనస్సును క్షోభపెడ్తే అది నిష్కృతిలేని మహాపాపమే ఔతుంది. అనుకుంటూ ఆవేదన పడుచున్నాడు సువర్ణశ్రీ .

"హిమబిందూ! ఎంత చిలిపిగా మాట్లాడుచున్నావు. విషయాన్ని దీర్ఘదృష్టితో ఆలోచించక నీ భవిష్యత్తుకు నీవే ద్రోహము చేసుకొంటావా? అలా చేయనని ప్రమాణం చెయ్యి." అని తన కుడిచేతిని చాచాడు సువర్ణశ్రీ.

అతని అప్పటి అవస్థను చూచి జాలిపడి హిమబిందు ఆవేదనతో అతని వద్దకు వెళ్ళింది.

"ప్రభూ! మీరు మానవులుకారు. దేవతలు. త్యాగమూర్తులు. మీరేమీ దిగులు పడకండి. వివాహమంటూ చేసుకుంటే నామనస్సున నిండి, నాఊపిరిలో ఊపిరియై, నా అణువణువును దోచుకున్న నాజీవితేశ్వరునే చేసుకొంటాను. కాకపోతే బౌద్ధభిక్షుకినై జీవిస్తాను. ప్రాణము మాత్రము తీసుకోను" అని అతని చేతిలో చేయివేసి ప్రమాణం చేసింది. అతని పాదాలపైపడి వాటిని ముద్దుపెట్టుకొని ఇక మీరు నిశ్చింతగా వెళ్ళండి". అని చెప్పింది హిమబిందు.

సువర్ణశ్రీ కొంతసేపు ఎమీ మాట్లాడలేక పోయాడు. హిమబిందు స్థిరసంకల్పాన్ని చూచి భవిష్యత్‌పరిణామం ఎలా ఉంటుందో? అని మరింతగా ఆవేదన చెందాడు. బుద్ధదేవా! నీవే గతి. హిమబిందు కుమారిని కాపాడే బాధ్యత నీదే. అని తన మనస్సులో అనుకొని ఆమె చేతులను పట్టుకొని తనహృదయానికి హత్తుకొని నదీతీరానికి వెళ్ళి పోయాడు.

అచ్చట కూర్చొని రాగరంజితమైన ప్రకృతిని, సోయగాలను వెదజల్లు చున్న కృష్ణానదీతీర సైకతభూములను, దూరంగా ఉన్న కొండలను, ఆకాశాన అటుఇటూ కదలాడే నీలిమేఘాలను చూస్తూఉండి పోయాడు. అలా ఎంతసేపు ఉండిపోయాడో తెలియదు. అన్నా! అని సిద్ధార్థనిక పిలిచింతవరకు సువర్ణశ్రీ ఈ లోకానికి రాలేకపోయాడు.

అన్నా! అమ్మ రమ్మంటూంది. అంటూ నాగబదనిక సువర్ణశ్రీ హస్తాన్ని పట్టుకొని లాగింది . ఏమీ మాట్లాడకుండా ఆమె వెంట ఇంటికి వళ్ళాడు సువర్ణశ్రీ.

పరమేశ్వరునిలీలలు ఎప్పుడూ ఇట్లే ఉంటాయి. జీవులతో ఆడుకోవడం అంటే ఆయనకు సరదా. ఆయన సంకల్పము ఏమిటో ఎవరికీ అంతు చిక్కదు.

స్త్రీ పురుషులు పరస్పరము ప్రేమించుకొనుట దోషమా? హిమ బిందును మనసార ప్రేమిస్తున్నాను. ఆమెను జీవితభాగస్వామిని చేసుకొని జీవితములో తియ్యందనాల అంచులను చవిచూడాలను కొన్నాను. కానీ ఆమెను యువరాజులకు ధర్మపత్నినిగా చేయాలను కుంటున్నాడు చారుగుప్తుడు. ఏమైనా మనసు ఒకరికే ఇవ్వగలిగేది. నా ఈ

హృదయము, ఆత్మ, నా యీ శరీరంలోని అణువణువూ ఆమెకు ఏనాడో అర్పించాను. హిమబిందు శిల్పసూత్ర లక్ష్యభూతమైన రూపము గలది. శిల్పిగా తానామెను ఆరాధించాలి. ఆమె మంజుల మనోజ్ఞ మహనీయ రూపాన్ని యీ నా హృదయము నుండి తీసివేయలేను. ఆమెలేని జీవితము కూడ నిస్సారమే. అట్లని నేను హిమబిందు, శ్రీకృష్ణుల వివాహానికి అడ్డుగోడకాను. యుద్ధవ్యవసాయ మందు నిమగ్నుడ నౌతాను. నాయీ శేషజీవితాన్ని దేశరక్షణకే వినియోగిస్తాను. అని నిర్ణయించుకొని సువర్ణశ్రీ బుద్ధదేవా! హిమబిందు శ్రీకృష్ణ శాతవాహనుల వివాహాన్ని నిర్విఘ్నంగా జరిపించు. నేను యుద్ధవీరుడనై యీ సామ్రాజ్యాన్ని కాపాడుకొంటూ నా యీ హృదయాధిష్ఠమూర్తియైన హిమబిందును ఈ శిలలో గండరించుకొని పారిజాతప్రసూనాలతో పూజించుకొంటూ ఇక్కడే ఉంటాను. అనుకొంటూ వెళ్ళుచున్నాడు ఒకనాడు సువర్ణశ్రీ.

హిమబిందు ఎదురుగా వచ్చింది.

ఆమెను చూచి సువర్ణశ్రీ ఆశ్చర్యపోయాడు.

"ఓహెూ శిల్పశేఖరులా! శిల్ప పూజకై సుమములను సేకరించుటకు పుష్పవనవాటిక వైపు వెళ్ళుచున్నారు కాబోలు?" -అని ప్రశ్నించింది. ఆమె సువర్ణశ్రీని సూటిగా చూస్తూ.

"హిమబిందుకుమారీ! ఈ వేళలో మీరు ఇక్కడ ఒంటరిగా సంచరించరాదు - శత్రువులు అన్నిచోట్ల ఉన్నారు."

"శత్రువులా? వారు నన్ను ఏమీచేయలేరు. ఇటుచూడండి" అంటూ ఒక కూత వేసింది. సాయుధులైన నలుగురుగోండువీరులు ప్రత్యక్షమయ్యారు.

"ఈ కూతను నీవెప్పుడు నేర్చుకొన్నావు" ఆశ్చర్యంగా అడిగాడు.

"మహాబలగోండుడు నేర్పాడు. ఈ వీరులను గూడ ఆయనే నారక్షణకు నియమించాడు. అదిసరే కానీ నాకు చిత్రకళను నేర్పించరూ! చూడండి. ఈ ప్రకృతి ఎంత రమణీయంగా కన్పిస్తూందో? కృష్ణానదిలో మునకలువేసి వస్తున్న పిల్లవాయువులు ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. అటువెళ్ళి కూర్చొని కొంతసేపు మాట్లాడుకుందాము రండి-"అని పలికింది హిమబిందు.

కాదని అంటే ఆమె మనస్సు మరింతగా బాధపడుతుందని గమనించిన సువర్ణశ్రీ ఆమె వెంట వెళ్ళి ఒక రసాలతరువుక్రింద ఆమె కూర్చోగా, తానూకూర్చొన్నాడు.

"ప్రభూ! నాకు కొన్ని సందేహాలు కలుగుచున్నవి. సమాధానము చెప్పరూ?"

"సమాధానాలా? శిల్ప విద్యను గురించి కానీ, చిత్రకళను గురించి కానీ ఏవైనా నాకు అనుమానాలొస్తే-మానాన్న గారిని అడిగి తీర్చు కొంటుంటాను. మీ ప్రశ్నలకు సమాధానాలు ఏమివ్వగలను."

"మీరు గట్టివారుగా కన్పిస్తున్నారు. తప్పుకొనేందు ప్రయత్నిస్తున్నారు. శిల్పకళను గురించీ, చిత్రకళను గురించీ కాదులే. జీవితాన్ని గురించే చెప్తారా?"

సమాధానము ఏమీ చెప్పకుండా ఆమె ముఖం వైపు చూచాడు సువర్ణశ్రీ.

"ప్రపంచములో స్త్రీ ప్రేమించుటే తప్పా? ప్రేమించేందుకు ఆమెకు స్వాతంత్ర్యము లేదా? మనసును కలిపి, మమతలను పెనవేసుకొని హృదయము నిండా ఉన్నవాణ్ణి భర్తగా స్వీకరించేహక్కు స్త్రీకి లేదు అని మీరు కూడ అంటారా? ఎవరి కొఱకో? ఎవరి ఆశలను తీర్చుటకో తన ఆశలను చంపుకోవాలా? ఆత్మవంచనకు సిద్ధపడాలా? మనసును చంపుకొని మనువాడి జీవితాంతం జీవంలేనికట్టెగా ఉండాలా? ఇదేనా ధర్మము? ఇదేనా మీరు చదివిన శాస్త్రాలు, గ్రంథాలు చెప్పేది?" అని ఆవేదనతో మాట్లాడింది.

సువర్ణశ్రీ నోరు తెరువలేదు

"చెప్పండి. సమాధానం చెప్పండి!" అంటూ ఆయన్ను పట్టుకొని - వెక్కివెక్కి ఏడ్చుచూ పలికింది.

సువర్ణశ్రీ కంపించి పోతున్నాడు . సమాధానం చెప్పలేక పోతూ న్నాడు.

"ప్రభూ! మీరు చెప్పలేరు. నా ప్రశ్నలకు సమాధానము చెప్పలేరు. ప్రభూ! మీరు స్వామిభక్తిపరాయణులు. మీరే కావాలనీ, తనసర్వస్వాన్ని త్యజించి, మహారాణిపదవి గూడ తుచ్ఛమైనదిగా

భావించి మిమ్ము చేరుకోవాలని తపించేదానిగతి ఏమైతేనేమి? కానీ మీ స్వామిభక్తికి కళంకము రాకుంటే చాలు. మీ మహారాజుకు, మీ యువరాజుకు ఎటువంటి కష్టము రాకుంటే చాలు, ప్రభూ!" అంటూ హిమబిందు గద్గదస్వరముతో, కట్టలుతెంచుకొని ప్రవహిస్తున్న కన్నీటిని ఆపుకొంటూ పలికింది.

సువర్ణశ్రీ మౌనంగా లేచి వెళ్ళిపోయాడు. అతను వెళ్తున్నవైపు చూస్తూ చూస్తూ ఉంది. అతను కనుమరుగు కాగానే హిమబిందు మెల్లగా నడుస్తూ పితృగృహాన్ని చేరుకొంది.

సువర్ణశ్రీ ధాన్యకటకములో ఉండలేకపోయాడు. తల్లి దండ్రుల అనుమతినిబొంది, అశ్వారూఢుడై, కొంతమంది గోండువీరులను తీసుకొని పాటలీపుత్రము వెళ్ళి శాతవాహనుల సైన్యములో కలిసిపోయాడు.

ధాన్యకటకమును వదలి వచ్చిన స్థూలతిష్యుడు గయను చేరుకొని అక్కడ కొద్ది దినములున్నాడు. తిరిగి ప్రయాణమై పదిదినములకు పాటలీపుత్రాన్ని చేరుకొని అక్కడికి ఇరువది మైళ్ళదూరములో ఆశ్రమము నిర్మించుకొని శిష్యులతో నివసిస్తున్నాడు.

ఉద్ధృతమై విస్తరిస్తున్న బౌద్ధ మతాన్ని ఆపడం సాధ్యంకాదు. అను భావము ఆయనలో యేర్పడింది. వేదమతసముద్ధరణకై దీక్షబూనిన తనకు గతమంతా ఒక అపరిష్కృతసమస్యగా కన్పిస్తూంది. ఆర్ష ధర్మావలంబకులఇంట జన్మించి, ఆ విధములోనే వేదవిద్యను సశాస్త్రీయంగా అభ్యసించి, అందలి మెలకువలను గ్రహించిన తన కుమారుడే విధివశాత్తూ జరిగిన ఒక పడవ ప్రమాదఫలితంగా గతస్మృతిని పోగొట్టుకొని, బౌద్ధులచే రక్షింపబడి, బౌద్ధమత ధర్మాలను, త్రిపిటకాది బౌద్ధమతగ్రంథాలను చక్కగా అభ్యసించి ఆ బౌద్ధమతానికి ఆధార భూతుడుగా నిలుచుట ద్వారా, తనకు ఎదురుగా నిలిచి బౌద్ధమత ధర్మప్రచారానికి దీక్ష బూనడం వంటి సంఘటనలు ఆయనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి. అయినా విషకన్యాప్రయోగం జరిగిపోయింది కనుక ఆమెను తిలకించిన వెంటనే అద్భుతమైన ఆమె రూపలావణ్యాలకు ముగ్ధుడై, ఆకర్షితుడై శ్రీ కృష్ణశాతవాహనుడు ఆమె కౌగిలిలో ఈ పాటికే విగతజీవుడై పడి ఉంటాడని ఆయన అనుకొంటూ, ఆవేదనను చెందుచున్న తన మనస్సును ఊరడించుకొనుచున్నాడు.

మాళవములోనే బౌద్ధులు నశిస్తారని ఆయన ఊహించాడు. అలా జరగలేదు. ఆ విధంగా జరగక పోవడం గూడ మేలే అయింది. బలిష్ఠమైన ఆ పాటలీపుత్రాన్ని ముట్టడించిన వీరిలో ఒకరు కూడ ధాన్యకటకాన్ని చేరలేరు. బౌద్ధమత మింతటితో అంతరించక పోతుందా? అని అనుకొంటూ భవిష్యత్తును గూర్చి ఆలోచించుకొంటూ స్థూలతిష్యుడు ఆశాసౌధాలను నిర్మించు కొంటున్నాడు.

వాస్తవము ఆయన ఆలోచనలకు విరుద్ధంగా ఉంది. ఆంధ్ర సైన్యములు పాటలీపుత్రముపై అమితోత్సాహంతో విక్రమిస్తున్నాయి. ఆరుకోటలను వశపరచు కొన్నాయి. మిగతా రెండు కోటల్లో కూడ ఆంధ్రసైనికులు స్థావరాలు ఏర్పరచు కొన్నారు. విజయము వారికి అతిచేరువలో ఉంది.

అట్టి పరిస్థితులలో ఒకనాడు. ప్రశాంత సాయంసమయములో, శ్రీముఖ మహారాజు, చారుగుప్తుల వారు కూర్చొని మాట్లాడు కొంటున్నారు. వారిముఖాల్లో ఆనందోత్సాహాలు అత్యద్భుతంగా కనిపిస్తున్నాయి.

"ప్రభూ!" పలికాడు చారుగుప్తుడు.

"వర్తకసార్వభౌములు ఏదో చెప్పదలచు కొంటున్నారు" - చారుగుప్తుల ముఖాన్ని చూస్తూ అడిగాడు మహారాజు.

"మహారాజా! చిరకాలంగా నాలో ఒక కోరిక ఉంది. ప్రభువులకు విన్నవించాలనుకుంటున్నాను."

"చారుగుప్తమహాశయా! నూకడ మీకు కూడ ముఖమాటమా! తమ మనస్సులోగల కోరిక ఏదో చెప్పండి."

"ప్రభూ! హిమబిందును తమ కోడలిగా స్వీకరించండి."

"వర్తకశ్రేష్ఠా! అందుకు అభ్యంతర మేముంది. మీతో వియ్యమందడం మాకు ఎప్పుడూ అభిలషణీయమే. ఈ ఆంధ్ర సామ్రాజ్యము ఇంతగా విస్తరించుటకు ప్రధానకారకులూ, ప్రోత్సాహకులూ అన్నీ మీరేగదా?"

"మహారాజా! దానితో ఈ విషయాన్ని ముడిపెట్టకండి. అది మీ సామ్రాజ్య పౌరునిగా, పైపెచ్చు ఆంధ్రునిగా నా కర్తవ్యము. ఆంధ్రులు ఈ జంబూద్వీపాని కంతకూ రాజులు కావాలి అనేది నా చిరకాలవాంఛ.

అందుకు నా సర్వస్వాన్ని ధారపోయాలనుకొన్నాను. ఉత్తములు. సమర్థులు. యోగ్యులు. అగు మీరు నా సంకల్పం నెరవేరేందుకు తగినవారుగా లభించారు."

చారుగుప్తా! నీవంటి త్యాగబుద్ధి కలవారు, దేశభక్తి కలవారు అతి తక్కువగా లభిస్తారు. ప్రత్యుపకార మాశించని మీ పరోపకార శీలానికి నా కైమోడ్పులు. హిమబిందు లోకములోనున్న సుగుణములు, సచ్ఛీలములు సమస్తమూ రాసిపోయగా మూర్తీభవించిన లావణ్యమూర్తి. ఆమెను మా కోడలుగా చేసుకొనుటకు మా మనస్సు ఆనందంతో అంగీకరిస్తూ ఉంది. ఈ రోజే మహారాణితో గూడ ఈ విషయం చెప్పి, రేపే యువరాజులకు వర్తమాన మంపుతాను.

"పాటలీపుత్రమునుండి మహారాజు తమకు పంపిన వర్త మానము" అని సేవకుడు ఇచ్చిన లేఖను తీసుకొని చదివాడు యువరాజు.

"చిరంజీవి యువరాజులు శ్రీ కృష్ణశాతవాహనునికి. తమ తండ్రి ఆశీఃపూర్వకంగా వ్రాయు లేఖ................. చారుగుప్తులవారు వణిక్సార్వభౌములు. అనన్యము, అత్యద్భుతము అయిన ఆయన దేశభక్తి, రాజభక్తి నీ వెఱుగనిదికాదు. ఆంధ్రమహాసామ్రాజ్యము బలంగా నిలద్రొక్కుకొని, ఇంతగా విస్తరిల్లుచున్నది, అంటే అందుకు ఆయన అండ, అపు, ఆదరణ, సహకారము, మేధస్సు ఎంతగానో ఉన్నాయి. ఆయన గొప్ప త్యాగశీలి. ఆయన ఆదరణను ఈ సామ్రాజ్య పాలకులు ఎప్పుడూ మరువరానిది. మనము ఏవిధంగా కృతజ్ఞతలు చెప్పుకున్నా ఆయన ఋణాన్ని తీర్చలేము. ఆయన పుత్రిక "హిమ బిందు". అందచందాలలోను, అంతః సౌందర్యములోను ఆమెకు ఆమే సాటి. ఆంధ్రశాతవాహనసామ్రాజ్యానికి కీర్తిని, ప్రశస్తిని, తేజస్సును తేగల ఆమెను నీ అర్ధాంగిగా చేయాలని చారుగుప్తులవారు మా అంగీకారాన్ని కోరారు. ఇంతకన్న మనకు ఆనందకరమైనదేముంది? నేను, మీ అమ్మ అంగీకారాన్ని తెలిపాము. అట్టి లోకోత్తర సౌందర్యవతిని, సుగుణములరాశిని భావిసామ్రాజ్ఞిగా పొందడం మహాభాగ్యము. అంగీకరించు కుమారా!"

ఆ ఉత్తరాన్ని చదివిన యువరాజుకు మతిపోయింది. క్షణకాలము దివి క్రిందై భువి పైపై నట్లయింది. వెంట, వెంటనే ఒక్కొక్కటిగా ఆలోచనలు మెదిలాడాయి.

హిమబిందును సువర్ణశ్రీ శకటవేగపరీక్షా సమయాన తిలకించాడు. ఆమె సౌందర్యవతే. కానీ ఆ సౌందర్యము యవన, భారతీయ సమ్మిశ్రితమైంది. ప్రతిభావంతుడగు శిల్పశ్రేష్ఠుని ఉలి సవ్వడిలో రూపము గొనిన శిల్పమువంటిది ఆమె అవయవ నిర్మాణము. అందులో అతనికి దివ్యదర్శనం లభించలేదు. మనస్సులో ప్రణయభావ మంకురించలేదు.

"సామాన్యరాజకుమారులవలె కామేచ్ఛ గలదికాని తనమనస్సు ఏదో అంతర్లీనమైన ప్రేమను, అవ్యక్తమైన మధురిమను ఆకాంక్షిస్తూ ఉంది."

విషకన్య. కాదు. ఆమె ఇప్పుడు చంద్రబాల. ఆ మహారణ్య మధ్యమున ఆమెను కాంచినప్పుడే తన మనస్సు ఆమెకు అంకితమైంది. ఆమెతోనే జీవనలతను పెనవేసుకోమని ఎవరో ఆదేశించినట్లయింది. ఆమె సందర్శనమాత్రాన్నే తనహృదయములో ప్రణయభావనలు అంకురించాయి. ఆమె లేని తన జీవనము రసహీనము. అర్థరహితము. అన్నభావనలు తనలో ఆనాడే అంకురించాయి. ఆమెయా? నా ప్రణయసామ్రాజ్యసింహాసనాన్ని అలంకరించతగినది. లేక హిమబిందువా?

ఆంధ్రశాతవాహనసామ్రాజ్యయశోవిభూతికి ఎవరు కారకులు? ఆమహాత్ముడు చారుగుప్తుడే కదా. ఆయన సర్వప్రాణములు హిమబిందువే. చక్రవర్తికీ, ఈ ఆంధ్ర సామ్రాజ్యములోని సర్వజనులకూ చారుగుప్తులవారు ప్రాణము. ఆ గుండె ఆగిపోతే? ఇక ఊహించలేక పోయాడు శ్రీ కృష్ణుడు.

విషబాలసందర్శనకై ఆయన మనస్సు ఆరాటపడింది.

ఆయన విడిదికి ప్రక్కగా రెండు కుటీరములు ఉన్నవి. ఆవల ఒక విశాలమైన ఒకరాజభవనం ఉంది. దానిచుట్టూ పుష్పఫలభరితములైన వృక్షములుగల మహోద్యానవనముంది. అందులో విషబాల నివసిస్తూ ఉంది. మధ్యనగల భవనాలలో విషవైద్యులు నివసిస్తూ ఉన్నారు.

విషబాల కుటీరములో విషవైద్యులు, ఆమెకు పరిచర్యలు చేయుటకు అవసరమైన పనికత్తెలు ఉన్నారు. విషవైద్యులు విషకన్యను అమృతకన్యగా చేయుటకు శక్తి వంచనలేకుండా ప్రయత్నిస్తున్నారు. పరిచారికలు వారమునకు ఒక బృందము అక్కడ ఉండి, వెళ్ళి ,రెండు నెలలు ఔషధసేవ చేయాలి.

"వైద్యశేఖరా! చంద్రబాలను సందర్శించి ఇప్పటికి మూడు దినాలైంది. ఈ రోజు ఆమెను సందర్శించి తీరాలి."

"వీలులేదు కుమారా! మరి ఏడుదినములు ఓపిక పట్టండి."

"మీరు చెప్పింది నిజమే. కానీ ఆమెను అత్యవసరముగా చూడవలసి వచ్చింది."

"తప్పదంటారా?"

"తప్పదు. లేకున్న మీ ఆదేశాన్ని కాదంటానా?"

"అయితే ఒక ఝాము ఓపిక పట్టండి. ఆమె ఇంకా కొన్ని దివ్య ఔషధాలను సేవించాలి. త్రివిధములైన చూర్ణములను అమృత ఫలరసముతో తీసుకోవాలి. వత్యాదని, సోమవల్లి, నిర్గుండి, శ్వేతసురస, మధూలిక, కర్పూర సిలాజిత్తులతో బాటు కొన్ని హిమపర్వత సానువుల బుట్టిన తొమ్మిది మూలికలను ఆమె సేవించాలి. అనంతరము ఆమె శరీరమంతా ఒక తైలమును రాయాలి. ఈ ప్రక్రియ ముగిసిన తర్వాత మీరు ఆమెను చూడవచ్చు."

"ఆ పని ఏదో తొందరగా చేయండి."

ఆ విశాలసుందరభవనములో ఒక దివ్యమణిఖచితస్వర్ణ పీఠముపై కూర్చొని చంద్రబాల వీణెను వాయిస్తూ, గీతమును ఆలాపిస్తూ ఉంది. ఆ గీతము సామవేద మందలిది. స్థౌలతిష్యుడు తన మనుమరాలుకు వేదగానాన్ని నేర్పాడు. ఆమె గొంతులో మధురిమలు పొంగి పొర్లుచున్నాయి. తెల్లనిపట్టుచీరనుకట్టి, కెంజాయరంగురవికను ధరించింది. వెంట్రుకలను పైకికట్టి, దానిచుట్టూ మల్లెలసరులను చుట్టి, సిగమొదటిలో ఎఱ్ఱటి మందారపుష్పాన్ని బెట్టింది.

విషవైద్యుని అనుమతితో ఆ మందిరములో ప్రవేశించిన శ్రీకృష్ణుడు తలుపుచాటునుండి క్షణకాలమా వీణాగానాన్నివిని, ఆమె స్నిగ్ధసౌందర్యానికి ముగ్ధుడగుచూ, ఆమె ఎదుటకి వచ్చి నిలిచాడు.

చంద్రబాల వీణెను వాయించుట చాలించి, దాన్ని ప్రక్కనున్న చెలి కందిస్తూ తల ఎత్తి చూచింది.

ఎదుట రాకుమారుడు.

ఆమె ఆనందానికి అవధులు లేకపోయాయి. కానీ, తాను ఆయనకు తగననీ, తానొక విషకీటకముననీ భావన రాగానే ఆమె మనస్సులో ఆందోళన చెలరేగింది.

"ప్రభూ! ఈ విషకీటకాన్ని చూడడానికి ఎందుకింత త్వరపడి వచ్చారు. నన్ను మరచిపోండి."

"బాలా! అది ఈజన్మలో సాధ్యము కానిది. నీవులేనిదే నేను లేను. నీతోడిదే నాకు లోకము. నీవులేని ఈ జీవితానికి అర్థమేలేదు. నా జీవితసర్వస్వమూ నీవే. ఇది ఈ నాటి నిర్ణయము కాదు. నిన్ను ఆ మహారణ్యమధ్యములో, చైతన్యరహితస్థితిలో పడియున్నపుడు వీక్షించిన సమయములో తీసుకున్నదే."

"కానీ ప్రభూ! నీకు నేను అందుకు తగను. నా నిట్టూర్పు కూడ ప్రాణికి తగదు. నేను మృత్యువును. నీకు అర్ధాంగిగా కాకుండా నీపాదదాసిగా మాత్రమే. అది కూడ నీపాదాలను అంటకుండా, ఆ పాదాలను పూజించుకునే భాగ్యానికే నేను నోచుకున్నది. ఆ మహాభాగ్యాన్ని ప్రసాదించి నన్ను కరుణించండి. అదే చాలు ఈ జీవితానికి."

"లేదు. అలాజరగడానికి వీలులేదు. నేను ఇప్పుడే విషవైద్యులతో మాట్లాడివచ్చాను. నీవు అమృతకన్యవు కాబోవు చున్నావు."

"నిజమా? ప్రభూ!" - అంటూ ఆమె మరీ మరీ అడిగింది.

"అంతే కాదు. నీవు నాజీవిత భాగస్వామివి కాబోవుచున్నావు. ఈ విశాలఆంధ్రసామ్రాజ్యసింహాసనముపై పట్టపురాణిగా కూర్చోబోవుచు న్నావు. నీవు నా ప్రణయదేవతవు. నా సర్వస్వానివి. రా నా కౌగిలిలోనికి రా అంటూ" ఆయన ముందుకు పో బోయాడు.

చంద్రబాల రెండడుగులు వెనక్కివేసింది.

"ప్రభూ! తొందరపడకండి. మనము అందుకోబోతున్న ఆనందపు అంచులను మీకై మీరు దూరము చేసుకోకండి. విషవైద్యుల వారి అనుమతి తర్వాతనే మీరు నన్నంటాలి."

శ్రీకృష్ణుడు ఆగిపోయాడు.

పాటలీపుత్రవిజయము అనుకున్నంత కన్నా దూరమగుచూ ఉంది. ప్రాణనష్టం కూడ అంచనాలకు మించి జరగడము మొదలైంది. శ్రీముఖశాతవాహనులకు ఆ జననష్టం తీవ్ర మనస్తాపాన్ని కలిగించింది. అమృతపాదుల కా విషయము అనంతఆవేదనను కలుగ జేసింది.

ప్రాణనష్టం జరగకుండా పాటలీపుత్రాన్ని కైవసం చేసుకొనే ఉపాయాన్ని ఆలోచించండి -ఆదేశించాడు. ఒకనాటి సమావేశములో ప్రభువు శ్రీముఖమహారాజు.

అంతా ఆలోచనా మగ్నులై ఉన్నారు.

"ప్రాణ నష్టం జరుగ కుండా పాటలీ పుత్రాన్నికైవసం చేసుకోవాలంటే గంగాదేవిని ఉపయోగించు కోవాలి. గంగామార్గము మనకు హస్త గత మైతే పాటలీపుత్రం కొన్ని ఝాములలో మనకు వశమౌతుంది." - సువర్ణశ్రీ సర్వసైన్యాధ్యక్షునితో చెప్పాడు.

"మనకు వేయి పడవలు ఉన్నవి. గంగానది ఎగువ భాగములోను, దిగువ భాగములోను ప్రయాణము చేసి దాదాపు రెండువేల పడవలను సమకూర్చాను. వీనికితోడు అడవిబూరుగుచెట్లను, బాడితవృక్షాల్ని కూడ దాదాపు నాలుగువేల వరకు చేకూర్చాను. ఈ వృక్షములన్నింటినీ గంగానదిలో పడవేసి వాటిపై మన సైనికులు పడవలలో మాళవ సైనికుల వేషములో సిద్ధంగా ఉండాలి. మహాప్రజ్ఞావంతుడగు మన చారుగణాధ్యక్షులు శుకబాణులవారికి మాళవసైనికుల సంకేతములు తెలుసు. ఆ సంకేతములతో మాళవసైనికుల వేషములతో ఉన్న మన సైన్యము పాటలీపుత్రములోనికి జొరబడాలి. ఆ వెనుక మనసైనికులు లొనికిచొచ్చి కోటగోడలను బ్రద్దలు కొట్టాలి. ఆ మార్గాల వెంబడి మన సైన్యములు పాటలీపుత్రములోనికి ఒక్క సారిగా వెళ్ళాలి" అని కూడ సువర్ణశ్రీ సర్వసైన్యాధ్యక్షులకు తన ఉపాయాన్ని వివరించాడు.

ఆ ఉపాయము ఆయనకు నచ్చింది.

మహారాజు అనుమతి లభించింది.

సర్వసైన్యాధ్యక్షుడు సువర్ణశ్రీకి ఆ కార్యభారాన్ని అప్పగించాడు.

వర్షము జోరున కురుస్తూ ఉంది. పైగా అర్ధరాత్రి. పాటలీపుత్ర దుర్గమునకు ఒకవైపు ఆంధ్రసైనికులు మగధసైన్యాన్ని తాకుచూ

ఉన్నారు. శ్రీముఖ శాతవాహనుడు ఇరువదివేలసైనికులతో గజారూఢుడై యుద్ధాన్ని నడిపిస్తున్నాడు. సమవర్తి మొదలగు వీరులు ఆయనకు అంగరక్షకులుగా ఉంటూ యుద్ధం చేస్తూ ఉన్నారు.

ఆ సమయములో గంగానదిపై మూడు వందల నావలు. వాటినిండా సైనికులు. వారికి తోడు తోలుచిత్తులతో కట్టబడిన సామానులు. భొం, భొం అని శంఖములు ఊదారు. పాటలీపుత్రకోటతలుపులు తెరుచుకొన్నాయి. పడవలలో నుండి దిగి సైనికులు ఒక్కొక్కరే లోనికి వెళ్ళారు. కొన్ని ఘడియలు దాటే వరకు ఆ ప్రాంత మంతా నావలతో నిండిపోయింది. వేల సంఖ్యలోప్రచ్ఛన్నవేషధారులైన ఆంధ్రసైనికులు కోటలో ప్రవేశించారు.

సువర్ణశ్రీ ఒకఎత్తైన ఏనుగుపై నున్ననిశయ్యను ఏర్పరచుకొని దానిపై కూర్చొని దాన్ని నడిపిస్తున్నాడు. ఆ గజము తొండమున ఒక పెద్ద ఇనుప గద ఉంది. ఆ గజమును అధిరోహించి సువర్ణశ్రీ కవచధారియై, ఖడ్గధారియై దాన్ని నీటిలో దుమికించాడు. ఆ గజము కోటతలుపులను బ్రద్దలు కొట్టుటలో మహాప్రజ్ఞ గలది. ఆ గజము ఆ విధంగా వెళ్ళి తన తొండములోని గుదియతో ఆ కవాటాన్ని బ్రద్దలు కొట్టింది. కవాటాలు తెరచుకొన్నాయి. "సువర్ణశ్రీకి జై" అంటూ ఆంధ్ర సైనికులు లోనికి చొరపడ్డారు. ఇంతలో ఒక వైపునుండి 'శత్రువులు' 'శత్రువులు' అను కేకలు వినపడ్డాయి. ఆ కేకలు వినపడ్డ వైపుకు వెళ్ళుచున్న మగధరాజ్య సర్వసైన్యాధ్యక్షున్ని బంధించారు.

కోటలో ఎక్కడ చూచినా ఆంధ్రసైనికులే.

"మీరంతా ఆయుధాలు విడిచి నిలబడండి"- సువర్ణశ్రీ.

మగధ, మాళవాది పరపక్ష సైన్యాలకు అంతకు మించిన ఉపాయము తోచలేదు.

సువర్ణశ్రీ కొంత సైన్యాన్ని తోడు తీసుకొని కోటలో వేరొక చోట ఉన్న సుశర్మకాణ్వాయనుని సమీపించి.

"మీసర్వ సైన్యాధ్యక్షులు, సైన్యము లొంగిపోయింది. మీరు ఇక ఏమీ చేయలేరు" అని చెప్పాడు.

సుశర్మ తలవంచి పరాజయాన్ని అంగీకరించాడు.

సువర్ణశ్రీ ఆయన్ను శ్రీముఖశాతవాహనుని వద్దకు తీసుక వచ్చాడు.

విచారవదనంతో సుశర్మ గజమును దిగి శ్రీముఖునకు సాష్టాంగ నమస్కారమొనర్చి నిలబడ్డాడు, శ్రీముఖశాతవాహనుడు కూడ గజమును దిగి పాదచారియై వచ్చి సుశర్మ కాణ్వాయణునకు ప్రతి నమస్కారయొనర్చాడు. సుశర్మను కౌగిలించు కొన్నాడు. ఇరు పక్షాలలోనున్న సైనికులు జయ జయధ్వానాలు చేశారు.

"మహారాజా! ఈనాటితో మా కాణ్వాయనయుగము అంతరించింది. ఈ రాజ్యాన్ని మీరు నిశ్చింతగా ఏలుకోవచ్చు. కానీ మీరు అవలంబిస్తున్నది పాషండమతము. వేదములను, దైవమును కూడ మీరు అవమాన పరుస్తున్నారు. సనాతనము, పవిత్రము అయినది మన భారతభూమి. దీనికిరక్ష ఎల్లపుడు వేదమతమే. ఆ మత సంరక్షణకై నేను శక్తి కొద్దీ ప్రత్నించాను. మహర్షియైన స్థూలతిష్యుడు ఈ వేదమత రక్షణకై తన సర్వశక్తులు ఉపయోగించాడు. కానీ దైవము ఎందుకో మాకు సహకరించలేదు. ఈనాడు కాకపోయినా, ఏనాడైనా మీ బౌద్ధమతము అంతరించకపోదు. శాశ్వతంగా ఉండ గలిగేది ఒక వేదమతమే. వేదములు నిత్యములు. పరాజయాన్ని అంగీకరిస్తున్నాను. మీరు అనుమతించినచో వానప్రస్థుడనై హిమాలయముల కేగి జీవిస్తాను."

"చక్రవర్తీ ! మీరు మీ ధర్మాన్ని ఎట్లు నిర్వర్తిస్తున్నారో మేమును అట్లే మా ధర్మాన్ని నిర్వర్తిస్తున్నాము. మేము జేసేది మాత్రమే ధర్మబద్ధము. మీరు చేసేది కాదు అనము. ఎవరికి నచ్చిన మార్గములలో వారు పయనించుట మానవ సహజము అను విషయం మీరు ఎరుగనిదికాదు. మీ ఇష్ట ప్రకారమే మీరు హిమాలయాలకు వెళ్ళ వచ్చు. మీకిష్టమగు వస్తువులను మీరు తీసుక పోవచ్చు."

"సార్వభౌమా! సెలవు. బౌద్ధమతమునూ, వేదమతమునూ సమానముగా పాలించు. ఇదే మా చివరి కోరిక."

సుశర్మకాణ్వాయనుడు సముచితపరివారయుతుడై హిమాలయాలకు ప్రయాణమయ్యాడు.

పాటలీపుత్రము సులభముగా తమ కైవసమయ్యేందుకు 'సువర్ణశ్రీ' కారకుడైనందుకు మహారాజు అతని యుద్ధరచనానైపుణ్యాన్ని, రాజభక్తిని, దేశభక్తిని ఉగ్గడించాడు.

సువర్ణశ్రీ ఈ యుద్ధమున మరణమును కాంక్షించాడు. అందుకు ఫలితంగా విజయశ్రీ లభించింది. మహారాజు మన్ననలు లభించాయి. ఇవి అన్నీ అతనిలోని విరక్తిభావాన్ని పోగొట్టలేక పోయాయి. అయితే వీరుడుగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించాడు. ఇంటికి వెళ్లి తల్లిదండ్రులకు చెప్పి ప్రాపంచికవిషయాలమీద మనస్సు పోలేదని పలికి తీర్థయాత్రాపేక్షతో కాశికి బయలు దేరాడు.

ఆంధ్ర సైనికులు విజయోత్సవాలు జరుపు కొంటున్నారు.

దైవసంకల్పము ఇట్లే ఉంటే, మానవమాత్రులు చేయగలిగింది ఏమీ లేదు అని స్థూలతిష్యుడు పరితపిస్తున్న తన హృదయాన్ని చక్కబెట్టుకొని తపస్సుకు వెళ్లిపోయాడు.

తన శ్రమఫలించి కోరిక నెరవేరనున్న సమయం ఆసన్నమైనదని చారుగుప్తుడు సంతోషిస్తూ కల్యాణ శుభ ఘడియకై ఎదురు చూస్తున్నాడు..

---

"కుమారా! ఆంధ్ర సామ్రాజ్యము ప్రాక్పశ్చిమాల వరకు వ్యాపించింది. ఈ విశాలసామ్రాజ్యానికి నీవు పట్టభద్రుడవు కావాలి. అంతకు ముందుగా పట్టపురాణిని నీవు ఎన్ను కోవాలి. చారుగుప్తులవారు తన తనయ హిమబిందును కోడలిని చేసుకొమ్మని అర్థిస్తున్నాడు. ఆయన మన సామ్రాజ్యానికి ప్రాణము. మన రాజవంశానికి ఊపిరి. ఆయన కోర్కెను తీర్చుట మన కనీస కర్తవ్యము. ముహూర్త నిర్ణయానికి జ్యోతిష్కుల వారిని పిలువ మందువా? -ప్రశ్నించాడు ఒకనాడు శ్రీముఖుడు శ్రీకృష్ణ శాతవాహనునితో

మహారాజా! మన్నించు. నా హృదయము విషకన్యయైన చంద్రబాలకు ఏనాడో అర్పితమైంది. జీవితములో ఏదైనా ఇకముందు ఆమెతోనే అనే నిశ్చయానికి వచ్చాను. ఈ నా హృదయములో హిమబిందుకు చోటులేదు. ప్రభువులు మన్నించాలి.

కుమారుని జవాబు శ్రీముఖుని దిగ్భ్రాంతుని చేసింది. ఆ తరువాత ఆయన ఎన్నో విధాల చెప్పి చూచాడు. కానీ శ్రీకృష్ణుని నిర్ణయం మారలేదు.

చారుగుప్తులు ఈ సామ్రాజ్యానికి చేసిన మహోపకృతి మరువరానిది. అయినా ఆయన కోరికను తీర్చలేక పోతున్నందుకు మహారాజు మానసికంగా క్రుంగిపోయాడు. చారుగుప్తులకు ఏమని సమాధానం

చెప్పాలో తెలియలేదు. ఈ బెంగతో మహారాజు మనశ్శాంతి కొఱకు అమృతపాదులను సందర్శించాడు.

"మహారాజా! కార్యార్థులై మా దర్శనమునకు వచ్చితిరా?"

"స్వామీ! ఒక ధర్మసంశయనివృత్తికై నేను మీ వద్దకు వచ్చితిని. చారుగుప్తులవారు తన తనయను కోడలిని చేసుకోమంటున్నాడు. యువరాజు మనస్సు విషకన్య పై లగ్నమైంది. చారుగుప్తుల కేమని సమాధానము చెప్పాలో తెలియుటలేదు. ఆయన ఆంధ్ర సామ్రాజ్యానికి ఆదిశేషునివంటివాడు.

మహారాజా! విషకన్యను నేనును చూచితిని. ఆమె అతిలోక సౌందర్యవతి. సువర్చల. సుమనస్వి. హిమబిందుది శిల్పసూత్ర లక్ష్య భూతమైన సౌందర్యము .

"కావచ్చు - చారుగుప్తుడు ఆ బాలికను ఈ విశాలసామ్రాజ్యానికి పట్టమహిషిని చేయాలని తపస్సానరిస్తున్నాడు. ఆయన మనస్సును ఎలా కష్టపెట్టాలి."

"మహారాజా! ఆడ బిడ్డలు ఈడు వచ్చిన వెంటనే ప్రేమానురక్తులగుట సహజము. ఆ ప్రేమ ఎవరియొద్ద ఏవిధంగా పుష్పిస్తుందో ఎవరికీ బోధపడదు. హిమబిందు సువర్ణశ్రీ యెడ అనురక్తురాలై ఉంది."

"ఔనా! స్వామీ!"

"ఔను. సువర్ణశ్రీకి ఏమితక్కువ - మహాపరాక్రమవంతుడు. సర్వవిద్యాపారంగతుడు. వినయశీలి. తథాగతునిసంకల్పము అట్లే అయినప్పుడు మనము చేయగలిగింది ఏమీలేదు. అభిజాత్యగుణ సంపన్నుడు, శిల్పచక్రవర్తి అయిన సువర్ణశ్రీ చారుగుప్తుని అల్లుడు కావడం ఆనంద దాయకమే కదా!"

"ఈ విషయాన్ని విని చారుగుప్తుల వారి గుండె పగులకుండా ఉంటుందా? స్వామీ!"

"అంతా భగవానుని ఇచ్ఛ."

"అయితే విషకన్య యువరాజును వివాహ మాడుటకు ఎలా తగుతుంది."

"ఆమె ఇప్పుడు విషకన్య కాదు. అమృత కన్య. ఆమెలోని విషములన్నిటినీ మన వైద్యులు పూర్తిగా తొలగించి అమృత కన్యను చేశారు."

"మహాప్రసాదము స్వామీ అని చారుగుప్తుడు వెడలి పోయాడు.

సువర్ణశ్రీ కాశికి బయలు దేరుట విన్న హిమబిందు తన చెలికత్తెను, మరి నలుగురు గోండువీరులను తోడుగా తీసుకుని రథారూఢయై కొంత దూరమరిగి అక్కడ ఒక ఓడను సంపాదించు కొని గంగానదీ తీరము వెంబడి కాశికి బయలు దేరింది.

బయలుదేరుటకు ముందు ఆమె తన మనస్సును సువర్ణశ్రీకి అర్పించానని, తనను రక్షించిన సమయముననే తన హృదయమును ఆయనకు అంకితం చేశానని ఆయన కొరకై తాను కాశీ యాత్రకు బయలు దేరుచున్నానని వ్రాసిన ఒక ఉత్తరాన్ని తన తండ్రి చారుగుప్తులకు అందించమని ఇద్దరు గోండువీరులను పాటలీపుత్రానికి పంపింది.



"ఎవరీ విషకన్య"? స్థూలతిష్యుడు తాను చెడింది కాక నాకు కూడ అడ్డమయ్యాడు.

మహారాజు తన కుమారునికి ఎన్నిరకాల చెప్పాలో అన్నిరకాల చెప్పాడు. మహారాణి సైతము "హిమబిందు" ను పట్టపురాణిగా చేసుకొమ్మని చెప్పి చూచింది.

కానీ యువరాజు మనస్సు మారలేదు. తనకంటూ వివాహమైతే ఆ వివాహం 'విషకన్య' తోనే, కాకుంటే, జీవిత కాలమంతా బ్రహ్మచారిగా ఉండి తథాగతుని బోధనలు ప్రపంచ మంతా ప్రచారం చేస్తాడట.

మహారాజు చెప్పాడు బలవంతంగా శ్రీకృష్ణుని మనస్సు మార్చి మీకు అల్లుణ్ణి చేస్తానని.

దానివల్ల ఫలితం ఏముంది. అందువలన నాకుమార్తె సుఖపడుతుందా? సుఖపడక పోగా ఆమె జీవితం రసవిహీనమౌతుంది.

పెండ్లి అనేది పరస్పర ప్రేమానురక్తులైన యువతీ యువకులకే జరగాలి. ఆ ఇర్వురిలో ఏ ఒక్కరికీ ఇష్టములేక పోయినా అది ఆఇరువురి జీవితాలలో బడబాగ్నులను లేపుతుంది. మహాప్రచండ విచలిత సముద్ర తరంగాలవలె వారి జీవితం యావత్తు అల్లకల్లోలంగా ఉంటుంది. దాని వల్ల నా చిరకాల కోరిక నెరవేరవచ్చు. కానీ నా బిడ్డ సుఖపడదు. నేనింతగా ఎవరి కొరకై శ్రమించి ఈవిశాల ఆంధ్ర సామ్రాజ్య నిర్మాణానికి కారణభూతుడను అయ్యానో అతడు, ఆ కృష్ణ శాతవాహన యువరాజు జీవితం కూడ అంధకారమే ఔతుంది"-ఇలా ఆలోచిస్తూ కూర్చొన్నాడు చారుగుప్తుడు తన మందిరంలో.

యువరాజునిర్ణయంతో చారుగుప్తునిఆశలు ఇసుకతోకట్టిన భవంతుల్లా కూలి పోయాయి. తన కుమార్తె ఆంధ్రసామ్రాజ్యానికి మహారాణి కావాలి. హిమబిందు తప్పటడుగులు వేస్తున్న నాటినుండే ఆయన్ను ఈ మహాస్వప్నం ఆవహించింది. దాన్ని నిజం చేయాలని ఆయన ఎంతగానో ప్రయత్నించాడు. రూపములో మాత్రము హిమబిందు సామాన్యురాలా? జగదేకసుందరి. ఆమెకు అన్ని విద్యలు నేర్పించాను. కోకిలల స్వరంకన్న మధురమైంది ఆమె కంఠస్వరం. లోకధర్మాన్ని, శాస్త్ర ధర్మాన్ని కూడ ఆమె చక్కగా ఆకళించుకొంది. మహారాణికి కావలసిన అన్ని అర్హతలను ఆయన ఆమెకు కలిగించాడు. కానీ యువరాజు మనస్సున ఆమె మూర్తికి స్థానం లభించలేదు. అది తలచుకొంటూ, చారుగుప్తుడు చింతాకుల మానసు డగుచున్నాడు.

రాజుల మనస్సులు చంచలము లైనవి. అవి ఎప్పుడు ఆగ్రహిస్తాయో? ఎప్పుడు అనుగ్రహిస్తాయో? తెలియుటకు వీలు కానివి. ఋతువులలో గాలి, వానలు ఎప్పుడు వస్తాయో చెప్పవచ్చు. కానీ, రాజుల మనస్సులను పసిగట్టలేము. నా ఆశలు అడియాసలైనవి. నా శ్రమ అంతా వ్యర్థమైంది. లేదు. వ్యర్థము కాలేదు. అది చక్కగా ఫలించింది. ఈవిశాలఆంధ్ర సామ్రాజ్యానికి నా శాతవాహనప్రభువులు సమ్రాట్టు లయ్యారు. ఇందులో స్వార్థానికి తావులేదు.

నా కూతురు సువర్ణశ్రీని వివాహమాడుటయా? నా కూతురుకు, శిల్పియైన సువర్ణశ్రీకి ఎక్కడ? నేను వర్తకచక్రవర్తిని. చక్రవర్తులు చూడని దేశములు, భూములు గూడ నేను చూశాను. సిరి సంపదలలో నాతో సరివచ్చు ధనవంతులు ఈ భరతవర్షముననే కాదు సకల భూ మండలములోను లేరేమో? రత్నరాశులను బోసి సామ్రాజ్యాలనే కొనగల నా బిడ్డ ఒక శిల్పిని వరించుటయా? అహా భగవత్సంకల్పము ఎంత విచిత్రమైంది.

రాజులచిత్తములకన్న స్త్రీలహృదయాలు మరీ విచిత్రాలు, అగాధాలు. ఈ స్థితిలో నాకు సాయపడు వారెవ్వరు?

రాజవంశాన్ని జయిస్తాను. బౌద్ధమత విజృంభణను అడ్డుకొంటాను. అని బయలు దేరిన స్థూలతిష్యుడు తాను ఘోరంగా ఓడిపోయాడు. నా బిడ్డను ఎత్తుకొని పోయి సువర్ణశ్రీ, హిమబిందువులు కలుసు కొనునట్లు చేశాడు. విషకన్యను అరణ్యమధ్యమున విడిచి శ్రీకృష్ణుడు, విషకన్య కలుసుకొను నట్లు చేశాడు. నా కూతురుకన్న విషకన్య సౌందర్యవతియా? నా బిడ్డలో లేని అందము ఆమెలో ఏముంది? నాకేగాదు చూచిన వారందరికీ హిమబిందు జగదేక సుందరి గానే కన్పిస్తూంది. లోకములో ఉన్న అందాన్నంతా ఒకచోట రాశిపోసి పరమేశ్వరుడు ఈమెను సృష్టించాడు. అని ఎందరో ఆమెను ప్రశంసించారు. కానీ-కానీ-కానీ శ్రీకృష్ణుని మాత్రమే ఆమె ఆకర్షించ లేక పోయింది.

నా చెల్లెలి కుమారుడైన సమవర్తి హిమబిందువును వివాహమాడాలని ఎన్నో కలలు కన్నాడు. తనకు బావ కాబట్టి హిమబిందు చొరవగా అతని వద్దకు వెళ్ళినప్పుడల్లా నేనెంతో ఆవేదన పడ్డాను. వారిమధ్య ప్రణయభావనలు అంకురించకుండా సర్వజాగ్రత్తలు తీసికొన్నాను. కడకు ఒకసారి కఠినంగా సమవర్తిని మందలించాను కూడ. అయినా దైవేచ్ఛ నాకు అనుకూలించ లేదు. తథాగతుడు ఈ విషయములో ఆశీర్వదించ లేదు,-అని అనుకొంటూ చారుగుప్తుడు ఉబికివస్తున్న దుఃఖాన్ని అణచుకొంటున్నాడు.

ఇది నాకర్మఫలమా? లేక నా బిడ్డ కర్మఫలమా? కర్మఫలాన్ని ఎవ్వరూ అతి క్రమించలేరా? కాకున్న ఇంతగా ప్రేమించి, పెద్దజేసిన నా కన్నబిడ్డయే నా కోరికను నిరాకరించుటయా? -అని కూడ దుఃఖిస్తూ కన్నుల నుండి నీరు బొట బొట కారగా, ప్రక్కనున్న రత్న మంజూషను తెరచాడు చారుగుప్తుడు. ఆ మంజూషలో ఉన్న తన భార్య ప్రజాపతి స్వర్ణ ప్రతిమను చేతకొని, కారుచున్న కన్నీటిని తుడుచుకొంటూ,

"ప్రాణేశ్వరీ! చూచితివా? మన బిడ్డను మహారాణిని చేయాలని సంకల్పించాను. సంకల్పించుటే కాదు. నా సర్వ శక్తులనూ ఉపయోగించి ప్రయత్నించాను. కానీ మనబిడ్డ అందుకు విరుద్ధంగా ఆలోచించి శిల్పియైన ఒక యువకునికి మనసిచ్చి నేనుకన్న బంగారు కలలను భస్మీభూతము చేసింది. సహధర్మచారిణీ! నీవేల నన్ను వదలి వెళ్లితివి? ఇప్పుడు నన్ను ఏమి చేయమందువు? అని అంటూ ఆయన చైతన్యరహితుడయ్యాడు.

మనోహరా! మీరేల చింతించెదరు. ప్రేమ పరస్పర ప్రవర్ధమాన మగునది కదా? ప్రేమకు అంతస్తులు, అంతరాలు ఉంటాయా? సర్వమూ తెలిసిన మీరు ఈవిధంగా చింతించుట తగదు.

చారుగుప్తునితనయ అసామాన్యుని ప్రేమించునా? సువర్ణశ్రీ కేవలము శిల్పి మాత్రమే కాదు. మహాయోధుడు. త్యాగి. ఉత్తముడు. ప్రజ్ఞావంతుడు. అతనికి మన బిడ్డ హిమబిందును ఇచ్చి లోకోత్తరనుచేయండి. సువర్ణశ్రీ వల్ల లోకమునకుహితము కలుగును. మీరు ప్రాణప్రదంగా ప్రేమిస్తున్న ఆ లోకోత్తర హితము సువర్ణశ్రీ వల్ల రెండు ఆకులు మూడు పువ్వులుగా వికసిస్తుంది. యశఃపరిమళాలను విరజిమ్ముతుంది-అనుమాటలు వినిపించాయి.

అంతలో ఆయనకు తెలివి వచ్చింది. తన చేతిలో ఉన్న ఆ సువర్ణ ప్రతిమ అపూర్వ కాంతులతో నిగ నిగా మెరిసి పోతూ ఉంది. ఆ కాంతి పుంజములను చూస్తూ చారుగుప్తుడు.

"ప్రాణేశ్వరీ! పలికితివా! నీ ఆకాంక్ష కూడ అదేనా? ధన్యోస్మి. ఇక నాకు మాత్రము చింత ఎందుకు? అలాగే చేస్తాను". అంటూ ఆ స్వర్ణ ప్రతిమను పలుమార్లు ముద్దు పెట్టుకొని తిరిగి రత్నమంజూషలో పెట్టాడు చారుగుప్తుడు.

ఇంతలో చక్రవర్తి ఆ మందిరములో అడుగు పెట్టాడు.

"చారుగుప్తుల వారికి మా నమస్కారాలు. మేము మగధరాజ్య సింహాసనాన్ని అధిష్టించు శుభ సమయమున మిమ్ము మా ప్రతినిధిగా రాజ్యపీఠమున కూర్చొన వలసిందిగా కోరుటకు వచ్చినాము. అంగీకరించాలి"-అన్నాడు చక్రవర్తి.

"మహాప్రభూ! నాకు సింహాసనము అధిష్టించ వలెనను కోరికలేదు. నేను భగవంతుడు నిర్దేశించిన ధర్మమును చేయుటే కర్తవ్యముగా భావించిన వాణ్ణి."

శ్రీకృష్ణశాతవాహనులు ఈ విశాల ఆంధ్ర శాతవాహన సింహ పీఠాన్ని అధిరోహిస్తే చూడాలి అని నా చిరకాల వాంఛ. ఆంధ్రులు ప్రాక్ పశ్చిమాంబుధుల వరకూ తమ ఏలుబడిని సాగించాలి. ఇది నా ప్రగాఢవాంఛ. ఆ కోరిక తీరినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను."

"వర్తక చక్రవర్తీ! అలా అనకండి. మా కోరిక మన్నించియే తీరవలెను. ఈ సామ్రాజ్యానికి మీరు ఇచ్చిన తోడ్పాటు, సహకారము ఎప్పుడూ మరువరానిది. మీ సహకారమే లేకపోతే, మీ చల్లని ఆశీస్సులే లేకపోతే"...........

"చాలు ప్రభూ! చాలు. మీ హృదయములో ఇంత స్థానాన్ని నాకు కల్పించిన మీకు నా కృతజ్ఞతలు."

"కృతజ్ఞతలు చెప్పవలసింది మీరు కాదు. మేము. ఒక రకంగా మేము కృతఘ్నులము కూడ."

"ఎందుకు ప్రభూ!"

"నీ ప్రాణంలో ప్రాణంగా పెరిగిన హిమబిందును నా కోడలిగా చేసుకోలేక పోయాను. ఈ విశాల ఆంధ్ర సామ్రాజ్యానికి ఆమె సామ్రాజ్ఞి కావాలి అనే మీ మనోరథాన్ని తీర్చలేక పోయాను. చేసిన మేలును మరువడమంటే ఇంత కన్నా ఏముంటుంది. చేసిన మేలును మరువడం కృతఘ్నతకాక మరేమౌతుంది"!

"ప్రభూ! ఎంత మాటంటిరి. ఈ దేశ పౌరునిగా నాకది కర్తవ్యము. త్రికరణశుద్ధిగా నా కర్తవ్యాన్ని నెరవేర్చాను. ఇందులో స్వార్థానికి తావు లేదు. ప్రభూ! ఒకవేళ మీరు అలా భావించి ఉంటే మన్నించండి."

"వర్తకశేఖరా! నీ స్వార్థరహిత చింతనను ఎరుగనివాణ్ణి కాను. కానీ ఈవిధంగా నైనా నా కృతజ్ఞతలు తీర్చుకోవాలనుకున్నాను.

"రాజ్యాధికారము కావాలనేది నాకు ఎప్పుడూ అభిమతం కాదు. చిత్తశుద్ధితో, ఉత్తమపౌరునిగా కర్తవ్యాన్నినిర్వహించాలనేదే నా ధ్యేయము. ప్రభువుకు ఎప్పుడూ ఎదురాడి ఎరుగను. ఇకముందు కూడ. కానీ ఈ విషయములో మాత్రము మీ ఆదేశాన్ని శిరసావహించలేను. మన్నించండి." –అంటూ చారుగుప్తుడు ఈ ఆంధ్ర శాతవాహన వంశము మరోవెయ్యి సంవత్సరాలు ఈ భారతావనిని పాలించాలి అని తథాగతుని ప్రార్థించాడు.

చారుగుప్తుడు ఆ విధంగా మనస్సును దిటవు చేసుకొని చెంతనున్న గంటను మ్రోగించాడు,

వెంటనే ఇంద్రగోపుడు అచ్చటకు వచ్చాడు.

"ఇంద్రగోపా! మా చిరంజీవి హిమబిందు వారణాసికి వెళ్లినదట. ఆమెకు రక్షణగా రెండువేల సైన్యమును పంపుము. చారులకు వర్తమానం పంపి ఆమె ఎక్కడ ఉన్నదో జాడ తెలుసుకోమను. మేమును ఈ సాయంత్రం వారణాసికి బయలు దేరనున్నాము. నా రథమును సిద్ధము చేయమని భటులను ఆజ్ఞాపించు. మా మామగారికి హిమబిందు కుమారి వారణాసికి వెళ్లిన విషయాన్ని తెలియజేసి, వారిని నాతో రమ్మని నా ఆహ్వానం వారికి అందించు" అని చెప్పాడు.

"చిత్తము మహాప్రభూ!" అంటూ ఇంద్రగోపుడు వెళ్లిపోయాడు.

అనంతరము చారుగుప్తుడు పరిచారికల వైపు చూచి,

"మీరు ఈ విషయాన్ని మా అత్తగారికి తెల్పి, ఆమెను గూడ మాతో వచ్చుటకు సిద్ధము చేయండి. మీలో నలుగురు తారాదత్తయు,దాదులు కూడ నాతో వచ్చుటకు సిద్ధము కండి అని ఆనతి ఇచ్చాడు."

ఇంతలో, దౌవారికుడు వచ్చి "శ్రీకృష్ణశాతవాహనమహారాజు వేంచేశాడు" అని మనవి చేశాడు.

చారుగుప్తుడు తన వదనమున విషాదచ్ఛాయలు కన్పించకుండ చేసుకొని, చిరునగవుతో సభాభవనానికి వచ్చాడు.

శ్రీకృష్ణమహారాజు లేచి ఆయనకు నమస్కరించాడు.

చారుగుప్తుడు ప్రతి నమస్కారం చేసి, "ప్రభువులు తమ ఆసనాన్ని అధిరోహించాలి"-అన్నాడు.

చారుగుప్తుడు అక్కడ ఉన్న దంతపు సింహాసనముపై ఆసీనుడయ్యాడు.

సైన్యాధిపతులు బయటికి వెళ్లిపోయారు.

"చారుగుప్తులవారూ! నేను మీ మనస్సును క్షోభపెట్టి, మీకు తీరని అపచారము చేశాను. క్షమించ కోరుచున్నాను".

"మహాప్రభూ! అది పరమేశ్వరుని సంకల్పము. అందులో మీ తప్పు ఏమీ లేదు."

"నేనొక గొప్ప భాగ్యమును నాకై నేను పోగొట్టు కొన్నాను."

"మహారాజా! ఈ విషయంగా మీరు మీ మనస్సున ఏ కొఱతా ఉంచుకోవద్దు. తథాగతునిసంకల్పము అట్లున్నపుడు మానవ మాత్రులం మనము ఏమి చేయ గలం? మాబిడ్డ సువర్ణశ్రీని ప్రేమించింది. ఆమె ధర్మమున పరకీయ యైనది. మీరు వివాహమాడుటకు కూడ ఆమె ఇప్పుడు తగదు. నా బిడ్డ మనస్సును తెలుసుకోలేక ఇష్టానిష్టముల విచారించక, నా కన్నబిడ్డ విషయమున మూర్ఖుడనై ప్రవర్తించాను. మీ మనస్సును కూడ నొప్పించాను. విధి ప్రతికూలమును గమనించక, నేనే భగవంతుడను అయినట్లుగా ఆలోచించాను. నేను, మిమ్మ్మ అంత మొందించ సంకల్పించిన స్థౌలతిష్యుడను ధర్మముచే పరాభవించ బడిన వారమయ్యాము. తామునూ, ఆ విషకన్యయు, సువర్ణశ్రీయు, ఈ హిమబిందు ఏ మహత్తర కార్యసాధనకు ఈ భువిపై జన్మించితిరో? ఎవరికెరుక? మీ వలన ఈ ప్రపంచానికి ఏదైనా మేలు జరగాలని భగవానుని ప్రార్థిస్తున్నాను. మీ నలుగురి ఆనందమే నా ఆనందము. తథాగతుని పరమ కృపచే మీనల్గురూ పరమానందమున వర్ధిల్లెదరు గాత"! -అన్నాడు చారుగుప్తుడు ఆందోళన, ఆవేదన ఏ మాత్రము లేకుండా స్థితప్రజ్ఞునివలె.

"మీ చల్లని దీవెనలు మా శాతవాహనులకు పరమాశీర్వాద ములు", అని శ్రీకృష్ణశాతవాహనుడు వెళ్ళిపోయాడు.

---

"స్థౌలతిష్యులది సుతి మెత్తని మనస్సు. మాట కఠినము.

దురభిమానంగా మారిన ఆయన స్వమతాభి మానము ఆయన్ని రాక్షసుని చేసింది.

ఆయన మహాపండితుడు. దార్శనికుడు. గొప్ప వేదాంతి.

"వేదమతసంరక్షణము" అన్న ఒకే ఒక ధ్యాస ఆయన్ని ప్రాణ ప్రదంగా పెంచుకొన్న మనుమరాలినే తన లక్ష్యసాధనకు బలి చేయించేందుకు వెనుదీయ నీయలేదు.

బౌద్ధమత విద్వేషముతో బుసలు కొట్టున్న ఆయన మనస్సు పరాభవము అనే అగ్నితో దగ్ధమౌతూ ఉంది.

బౌద్ధమత విజృంభణాన్ని అడ్డుకొన లేక పోతిని గదా? అని ఆయన అనంతమైన ఆవేదనతో కుములుచూ ఉన్నాడు.

కానీ, ఆ మహనీయుని ఆశీస్సులు ఈ రాజ్యానికి కావాలి.

ఆయన మనస్సు చల్లబడాలి. ఆయన శాంతించాలి.

ప్రభూ! ఇది ఇప్పుడు మనము ఆలోచించి అవశ్యము ఒనరించ దగ్గది." -రాజకార్యార్థమై కోటకు ఆహ్వానింపబడి వెళ్ళిన అమృత పాదులు మహారాజు శ్రీముఖశాతవాహనునితో చెప్పాడు.

"ఆచార్యదేవా! మీ ఆలోచన లెస్సగా ఉంది. అందుకు మనము చేయవలసిందేమిటి?" సెలవివ్వండి.

"మహారాజా! విషకన్య మన వైద్యుల కృషి వల్ల అమృతకన్య కావచ్చింది. ఆమెను స్థూలతిష్యుల వద్దకు పంపించండి. ప్రాణముతో సమానంగా పెంచుకొన్న ఆమెను చూచి, ఒకప్రక్క చింతతోను, మరోప్రక్క ఆగ్రహముతోను ఉన్న ఆయన మనస్సు శాంతించ వచ్చును. ఆ సద్బ్రాహ్మణుని శాంతపరచడము మనకు తప్పని సరి.

అంతేకాదు.

మహారాజా! ఆమెను గురించిన కొన్ని విషయాలను మీరు వినవలసి ఉన్నది. అమృతకన్య స్థూలతిష్యులకు కేవలము పెంపుడు కూతురు మాత్రమే గాదు. ఆయన కుమారుని కుమార్తె. పుట్టుకతోనే తల్లిని పోగొట్టుకొని, తండ్రికి దూరమైన ఆమెను ఆయన పెంచి పెద్ద జేశాడు. తుదకు తన లక్ష్యసాధనకై జరిగే యజ్ఞములో ఆమెను సమిధగా వ్రేల్చేందుకు సిద్ధపడ్డాడు. ఆయనలోని మతసంరక్షణాసక్తి ఏపాటిదో ప్రభువులకు తెలుసు."

అనంతరము శ్రీముఖమహారాజు శ్రీకృష్ణ శాతవాహనులకు నచ్చచెప్పి అమృతకన్యను స్థూలతిష్యుని ఆశ్రమానికి చేర్పించాడు.

ఆమె ఇప్పుడు విశృంఖల. చెలికత్తెలతో చక్కగా మాట్లాడుకుంటూ ఉంది. ఉద్యానవనవిహారాలు చేస్తూ ఉంది. లోకవృత్తాంతాలను అవగాహన చేసుకొంటూ ఉంది. జీవితంలో ఇంతవరకు పోగొట్టుకున్న ఆనందాన్ని అనుభవిస్తూ ఉంది.

'ఆమె ఆట, పాట, పిలుపు అన్నీ స్థౌలతిష్యుని హృదయాన్ని శాంత పరుస్తున్నాయి.

కర్మసిద్ధాంతాన్ని చక్కగా నమ్మిన ఆయన, వేదమతసంరక్షణా బాధ్యతను ఆ పరమేశ్వరునికే వదలి, ఆ పరమేశ్వరారాధనలో నిశ్చింతగా కాలము గడుపుచూ ఉన్నాడు.

అమృతపాదుడు తనకన్న కొడుకే అన్న భావన అయన్ను మరింత ఆనందపరుస్తూ ఉంది.

అమృతకన్యయైన ఈ చంద్రబాల, ఆంధ్రశాతవాహన మహా సామ్రాజ్యానికి రాణి కానున్నది. ఆమె ద్వారా, క్షీణదశకు చేరిన వేదమతము తిరిగి ఉద్ధరించబడవచ్చు. అనే భావన కొంత ఆయన హృదయాంతరాలలో మిణుకు మిణుకు మనింది.

పాటలీపుత్ర విజయానికి సువర్ణశ్రీ ప్రధాన కారకుడు. అతని బుద్ధి బలము, భుజబలము కూడ ప్రశంసా పాత్రమైనవి. అతన్ని ఈ శాత వాహనసార్వభౌముల ప్రతినిధిగా పాటలీపుత్ర సింహ పీఠికను అధివసింప జేయాలి" - అనుకొంటున్నా డొకనాడు, మహారాజు శ్రీముఖుడు తన జైత్రయాత్రా విశేషాలను తలంచుకొంటూ.

"పితృపాదులకు ప్రణామాలు" అంటూ శ్రీకృష్ణశాతవాహనుడు మందిరములో ప్రవేశించాడు.

యువరాజు తన ఆలోచనను కుమారునికి చెప్పాడు.

"ఈ మీ నిర్ణయం చాలా ఆనందకరమైంది, సువర్ణశ్రీ, హిమబిందు ఒకరినొకరు ప్రేమించు కుంటున్నారు. ఆ ప్రేమికుల ఆశీర్వదించడం కూడ అవసరము."

"శ్రీకృష్ణశాతవాహనుడు హిమబిందును వివాహ మాడును. తాను పాటలీపుత్రమున ఉన్నయెడల హిమబిందు సుఖపడదు. అని భావించి, ఆ సుమనస్వి ఎక్కడికో పారిపోయాడు.

'కుమారా! వెంటనే వెళ్ళి నీవు ఆతనిని స్వయంగా తీసుక రమ్ము.'

శ్రీకృష్ణ శాతవాహనుడు తండ్రి పాదములకు సాష్టాంగ నమస్కారము చేసి నిలబడ్డాడు.

మహారాజు ఆయన్ను కౌగిలించుకొని మూర్ధమును ముద్దు పెట్టుకొని చిరంజీవ! అంటూ ఆశీర్వదించాడు.

అనంతర మా యువరాజు రథారూఢుడై, గంగా తీరముననున్న స్థౌలతిష్యుని ఆశ్రమం వైపు సాగాడు. మంత్రులు, సేనాపతులు ఆయన్ను అనుసరించారు.

"మహర్షిసత్తములకు శ్రీ కృష్ణుని ప్రణామాలు".

స్థౌలతిష్యుని పాదాలను స్పృశిస్తూ పలికాడు ఆశ్రమం చేరిన శ్రీకృష్ణుడు.

"మనోరథ సిద్ధిరస్తు" అంటూ పరిపూర్ణమైన వాత్సల్యముతో యువరాజును ఆ మహర్షి ఆశీర్వదించాడు.

ఆయన అనుమతిని గొని ఉద్యానవనములో ప్రవేశించాడు.

యువరాజు రాకను అంతకు ముందే పరిచారకుల వలన విన్న చంద్రబాల, గగని మొదలగు చెలికత్తెలను వదలి ఆనందపులకితాంత రంగముతో మత్తమరాళమువలె నడుస్తూ వచ్చి, ప్రభూ! వచ్చితిరా! అంటూ చేతులు సాచి ఆహ్వానించింది.

"దేవీ! ఆ పొదరింట కూర్చుందము రమ్ము." అంటూ ఆమె చేతిని పట్టుకొన్నాడు.

"మనోహరా ! ఔషధములను సేవించే వచ్చితిరా?"

లేకున్న, మీ తాతగారు లోనికి అనుమతిస్తారా?

స్వామీ ! మీ పాదారుణముల పూజిస్తూ జీవించేందుకై మనస్సు తహతహపడుతూ ఉంది.

ఆత్మేశ్వరీ! ఆ సమయము కూడ అతి సమీపములో ఉంది. దయాసముద్రులైన తాతగారి ఆశీస్సుల నందుకొన్న మనకు ఇంకే లోపమూ ఉండదు.

"దేవీ ! ఈ నీ తనూవల్లరి. ఈ నల్లని నీ కురులు. నీ యీ కరపల్లవాలు. నీ పెదవుల అరుణిమలు. నన్ను పరవశుని చేస్తూ నా మనస్సును తొందర పెట్టూ ఉన్నాయి."

"ప్రభువులు ధూర్తులగు చున్నారు."

"కాదు. ఈ దేవి చేస్తున్నది."

"నిజమా?" ఆమె సిగ్గుతో తలవంచు కొంది.

అభిమానవతులకు సింగారము ఈ సిగ్గే.

ఆమె ఓరగా చూస్తూ చిరునవ్వులు చిందించింది.

"మనోహరీ! సువర్ణశ్రీ వారణాసిలో ఉన్నట్లు తెలిసింది. ఆయన్ను పిలుచుక వచ్చేందుకు రేపే కాశికి ప్రయాణ మగుచున్నాను."

"ప్రభూ ! తప్పక కొనిరండు. మీరే స్వయంగా వెళ్లి ప్రార్థిస్తేగానీ ఆయన రాడు."

కాశిలోని సంఘారామం.

ఒక యువశిల్పి తథాగతుని రూపాన్ని గండరిస్తున్నాడు.

విశాల నేత్రుడు. మణిస్థగితకుండలుడు. మృగాజిన యజ్ఞోపవీత ధారి. విపులభుజస్కంధుడు. అందలి బుద్ధ భగవానుడు.

పరిశీలనగా చూస్తే ఆ శిల్పిలోని ఆవేదన అంతా ఆ విగ్రహములో కన్పిస్తూంది.

దుఃఖాతీతుడు, వేదనాతీతుడూ అయిన ఆ భగవానునిలో తనలోని ఆవేదనను మూర్తీభవింప జేసిన ఆ యువశిల్పిని చూచి,

నీ పోలిక విగ్రహాన్ని ఏల గండరించితివి? అని అడిగాడొక బౌద్ధ భిక్షువు.

శిల్పి పలుకక మౌనం వహించాడు.

"శిల్పియొక్క ఆకారాదులు, ఆవేదనలు అతనిచే చెక్కబడే విగ్రహములో రావచ్చు" అను ఒక శిల్ప సూత్రమిక్కడ యథార్థమైందని అనుకొంటున్నాను.

"కాదు. కావాలనే చెక్కాను."

"ఎందుకో?"

"కారణం చెప్పలేను."

"తెలిసింది. నీ మనస్సు ఏదో విషయమై వికలమై ఉన్నట్లుంది."

"వికలము కాలేదు. ఒక ముగ్ధ మనోహర దివ్యమూర్తికి అంకితమైంది. ఆమే నా ప్రాణము. ఆమే నా సర్వస్వము."

"అయితే ఆమెను నీ వెందులకు పొందలేదు."

"ఆమె నేను పొందదగినది కాదు, నేను భక్తి ప్రపత్తులతో పూజింప దగిన మఱియొక వ్యక్తికి చెందినది."

"అయితే, ఈపరిస్థితులలో నీకు దీక్షయే శరణ్యము సువర్ణశ్రీ."

"అవును నాకు దీక్షనివ్వండి."

"అటులనే రేపే దీక్షకు ఏర్పాట్లు చేస్తాను."

బౌద్ధభిక్షువు వెళ్ళిపోయాడు.

సువర్ణశ్రీ అర్ధనిమీళిత నేత్రుడై ఆ విగ్రహం ముందు నిలుచున్నాడు.

అంతవరకు అతని మనస్సును ఆవరించియున్న హిమబిందు అతని కన్నులలోనికి వచ్చింది. కాదు. అతని ముందు సాక్షాత్క రించినట్లుగా ఉంది.

హిమబిందు చిఱునవ్వులు చిందిస్తూ నిలబడినట్లుంది. సువర్ణశ్రీ మరింత గట్టిగా కన్నులు మూసుకున్నాడు.

క్షణమాత్ర మాత డానందమును పొందాడు. ఏమిటిది? లౌకిక వాంఛలను వీడి, దీక్ష గైకొని భగవానుని చరణాంబుజములను సేవించాలనుకునే నా మనస్సు తిరిగి చలించుచున్నది. సకల కళామూర్తియైన నా దేవి ప్రత్యక్ష మగుచున్నదా? కన్నులలో కదలాడుచున్నదా?

హిమబిందు. ఎంతటి మధుర నామాక్షరాలు. నిరంతరానంద సంజనిత కారణమై, నిశ్చల నిరీహ నయనాలతో నన్నే చూస్తున్నదా? అవును. ఆమెది సుతిమెత్తని మనస్సు. పరమదయాళువు. స్నిగ్ధ మధుర మందహాస. నావంటి ఉత్తమ శిల్పికి లక్ష్యభూత. స్వచ్ఛమైన మనస్సామెది. దానినిండా నేనే కానీ..........కానీ ఆమె ఇప్పుడు నా సమ్రాజ్ఞి, నాకు సర్వదా సర్వవిధాల ఆరాధనీయుడైన వ్యక్తికి చెందనున్నది.

"అందుకే నేను భిక్షువు నగుచున్నాను."

ఈ మాటలు బిగ్గరగా అన్నాడు సువర్ణశ్రీ.

'నీవు భిక్షుడవు ఎట్లు కాగలవు? నేను నిన్ను ప్రేమించుచుంటినే?'

అమృతోపమానములైన ఆ పలుకులు అతని చెవుల బడినవి. కన్నులు విచ్చిచూచాడు. ఎదుట 'హిమబిందు' సాక్షాత్తుగా నిలబడి ఉంది.

"హిమబిందూ! నీవు నన్ను ఇంకనూ మరచి పోలేదా?"

"అది ఈజన్మలో జరగనిది అని ఇంతకుముందే మీకు స్పష్ట పరిచాను గదా?"

ఆ మాటలు ఆ చూపులు సువర్ణశ్రీని మరియొక సారి చలింప జేశాయి. ఈ రూపలావణ్యరాశిని ఎత్తుకొని ఎక్కడికో సుదూర భూములకో, ఎవరూలేని ఏకాంతప్రదేశానికో ఎందుకు తీసుక పోకూడదు-అను భావమును కలిగించాయి.

ఈమె దివ్యానందం అనుభవించు -అన్నట్లుగా అతని మనస్సు తత్తరపెట్టసాగింది.

ఈమె ఆంధ్రశాతవాహనసామ్రాజ్యపట్టమహిషియై, అఖండ భోగభాగ్యాలనూ, అత్యద్భుత గౌరవ మర్యాదలనూ పొందనున్నది గదా! ఈమె జీవితమునకు నేనెందుకు అడ్డురావాలి-అను భావం వెంటనే ఆయనలో కలిగింది.

"లేదు. హిమబిందుకుమారీ! నన్ను మరచిపో. నేను బౌద్ధ భిక్షువునై వెళ్లిపోతున్నాను."

"భిక్షుకినై నేనూ నీ వెంటనే వస్తాను."

హిమబిందు నిస్సంకోచంగా జవాబు చెప్పింది.

"లేదు. నీవు భిక్షురాలివి కాకూడదు. ఈ మహాంధ్రసామ్రాజ్య సింహపీఠికను అధివసించాలి. చారుగుప్తమహనీయుని అండ, ఆశీస్సులు ఈ భారత వర్షానికి ఎప్పుడూ అవసరము. ఆయన ఆంధ్ర సామ్రాజ్య స్థిర యశస్సుకు ఆదిశేషుని వంటివాడు."

"ప్రభూ! మాటమార్చి నన్ను ఎందుకు మభ్య పెట్టాలను కుంటున్నారు. నేను, మీకు చేసిన అపరాధమేమిటి? నేను చారుగుప్తుని

తనయను కావడమే అపరాధమా? అయితే ఈ జన్మ ఈ విధంగా నిరర్థకము కావలసిందేనా? చారుగుప్తునంతటి శ్రీమంతునికి బిడ్డనై పుట్టుట ఇందులకేనా?"

"హిమబిందూ! చింతించకు. విధికృతమునకు ఎదురుండదు. నన్ను మరచిపో."

"ప్రభూ! మాటలు చాలించి నన్ను మన్నించు. నేనూ భిక్షుకినై మానవసేవలో పునీతు రాల నవుతాను."

"హిమబిందూ! నీ పితృదేవుల కోర్కెను మన్నించలేవా? భావిభారత సామ్రాజ్య దివ్య యశస్సుకు సహకరించ లేవా?

అని చేతులు జోడించి గద్గదిక- స్వరంతో

"హిమబిందూ! సన్యాసిని కావలెనన్న ఈ ఆలోచనను మానుకో'

"కుమారా! నీకు మాత్రము సన్యాస మేలనయ్యా?" అంటూ చారుగుప్తుడు అచ్చటికి వచ్చాడు.

ఆ సంఘారామకులపతి, కీర్తిగుప్తుడు అయన వెనుక లోనికి వచ్చారు.

చారుగుప్తుడు హిమబిందును తన హృదయమున కదుముకొని,

"కుమారీ! నీవు నా ప్రాణమమ్మా! నీకులేని ఆనందము నాకు మాత్రము ఉండునా? తల్లీ! నీ కన్నుల నీరు తిరిగితే నా పంచప్రాణాలు పరితపిస్తాయి గదమ్మా? నిన్ను ఈ సువర్ణశ్రీకి ఇచ్చి వివాహంచేసేందుకే నేను ఇచ్చటకు వచ్చాను తల్లీ! నావెంట నీమామగారునూ మీ తాత గారునూ వచ్చారు. సువర్ణశ్రీ! నీవు సన్యాసమెట్లు స్వీకరించెదవు? ఎందులకు స్వీకరించెదవు? నవనిధులు నడయాడే నాయింటికి అల్లుడవై, ఈ హిమబిందు హృదయసామ్రాజ్యాన్ని ఏలుకోవయ్యా!"

హిమబిందు తండ్రి మాటలకు ఆనందపడి అయనకంఠాన్ని తనచేతులతో చుట్టి అయన ఎదలో తన ముఖాన్నిదాచుకొని కడకంటి చూపులతో సువర్ణశ్రీని చూస్తూ నిలబడింది!

"సువర్ణా! నీవెట్లు భిక్షుకుడ వవుదువు?" ప్రశ్నించాడు సంఘారామ కులపతి.

"సువర్ణా! నా బాలికయైన ఈ హిమబిందు నీపై ప్రాణము పెట్టుకొని జీవిస్తున్నది. ఈమెపై నా ప్రాణాలు ఆధారపడి ఉన్నాయి. నా అభ్యర్థనను కాదనకు నాయనా?"

"ఈ వర్తకసార్వభౌములపై ఈ జంబూద్వీపమంతా ఆధారపడి ఉంది. నాయనా!" అన్నాడు వెంటనే సంఘారామకులపతి.

"అవును" -అంటూ ప్రవేశించాడు శ్రీకృష్ణశాతవాహనుడు ఆ మందిరములోకి,

ఆయన వెంట సువర్ణశ్రీ తల్లిదండ్రులు ధర్మనంది, శుక్తిమతీదేవి, ముక్తావళీదేవి లోనికి ప్రవేశించారు.

హిమబిందు తండ్రిని వీడి పరుగు పరుగున వచ్చి ముత్తవ ముక్తావళీదేవి ఒడిలో తలదూర్చి నిలుచుంది.

"క్షేమమా? కోడలా!" శుక్తిమతీదేవి నవ్వుచూ పలికింది.

"అమ్మా! అట్లు పిలువకు. ఈమె ఈ సువిశాల ఆంధ్ర సామ్రాజ్యానికి బావి సామ్రాజ్ఞి.. నేను నిత్యము పూజించ వలసిన వారి అర్ధాంగి."

"కాదు. సువర్ణా! కాదు. ఆమె నా చెల్లెలు-పలికాడు" మధ్యలోనే యువరాజు శ్రీకృష్ణుడు.

"ప్రభూ!" అంటూ ఆయన వైపు చూస్తూ నిలబడ్డాడు సువర్ణశ్రీ.

"నేనెప్పుడూ హిమబిందును ప్రేమించలేదు. హిమబిందు మనస్సు ఏనాడో నీపై లగ్నమై ఉంది. మహారాజుకు కూడ మీ ప్రేమ వ్యవహారము తెలిసింది. నా మనస్సును అమృతకన్యకు ఇచ్చివేశాను. మిమ్ము పాటలీపుత్రమునకు కొని పోవుటకై మహారాజుచే ఆజ్ఞాపింప బడి ఇచ్చటికి వచ్చాను.

"నాయనా సువర్ణా! హిమబిందు మనస్సును ఎఱుగక అమె ఈ ఆంధ్రసామ్రాజ్యసింహపీఠాన్ని అధిష్ఠించాలన్న ఏకైక వాంఛతో హిమ బిందును యువరాజుకు అర్ధాంగిని చేయాలనుకున్నాను. హిమబిందు మనసును తెలుసుకొన్న తర్వాత నా అభిప్రాయాన్ని మార్చుకొన్నాను. నీవు ఇక్కడున్నావని తెలిసి, హిమబిందు కూడ ఇక్కడికి వస్తుందని తెలిసి ఇక్కడికి వచ్చాను. ఇక నా అభ్యర్థనను కాదనక నా అల్లుడవై, నన్ను ఆనందపరచు నాయనా!" - పలికాడు చారుగుప్తుడు.

"వర్తక సార్వభౌమా!"-సువర్ణశ్రీ ఏయో చెప్పబోయాడు.

"సువర్ణా! ఇంకేమీ మాట్లాడకు. చారుగుప్తులవారి కోరికను నెరవేర్చు. హిమబిందుకుమారిని అర్ధాంగిగా స్వీకరించు. ఇది మా అందరికీ ఆనందదాయకం. మహారాజుకు కూడ నాయనా!"-అన్నాడు ధర్మనంది.

సువర్ణశ్రీ వచ్చి చారుగుప్తుల పాదాలకు ప్రణమిల్లాడు.

చారుగుప్తుడు ఆయన్ను లేవనెత్తి ఆయన చేతిలో హిమబిందు చేతిని ఉంచాడు.

అక్కడ ఉన్న వారందరూ బుద్ధభగవానుని ప్రార్థించారు.

శ్రీముఖశాతవాహనుడు పాటలీపుత్ర రాజ్యసింహాసనాన్ని అధిష్టించుటకు స్థూలతిష్యుడు ముహూర్తం నిర్ణయించాడు.

అది శ్రావణశుద్ధ పంచమి, ఆరోజు ఉత్తరఫల్గుణీనక్షత్రము మూడవ పాదములో ఉన్న కన్యాలగ్నమున చక్రవర్తిగా పట్టాభిషేకం జరిగింది. అప్పుడు చంద్రుడు లగ్నములో ప్రకాశిస్తూ ఉన్నాడు. సూర్యుడు కర్కాటకములో, గురువు మీనములో, బుధ, శుక్రులు లగ్నానికి పదవ స్థానంలో బలంగా ఉన్నారు.

పాటలీపుత్ర నగరములో ఎక్కడ చూచినా ఆనందోత్సాహాలే. ఏ మూల చూచినా అందంగా అలంకరించబడింది. ఏ యింటిముంగిలి చూచినా ముత్యాలముగ్గులే. పుర వీధులు రంగు రంగుల తోరణాలతో అలంకరించబడ్డాయి. ఆనాటి ఆ పురశృంగారాన్ని చూచిన కవులు ఈ పట్టణము "అలకాపురి"నే తలదన్నుచూ ఉందన్నారు.

శాతవాహనులరాజధాని ధాన్యకటకము కూడ ఆనాడు దీనికి రెట్టింపుగా అలంకరింప బడింది. కోటగోడలపై విజయపతాకలు రెప రెపలాడుతూ ఉన్నాయి.

'వైకుంఠపుర వైభవాన్నీ, అలకానగరాన్నీ గూడ ఈ నాటి ఈ ధాన్యకటకము మించిందని" వర్ణించారు కవులు ఆనాటి ఆ ధాన్యకటక నగర సోయగాన్ని.

శ్రీముఖశాతవాహనుడు పట్టాభిషేకోత్సవానికి తయారగుచున్నాడు. ఆనాటి ప్రత్యూషాన్నే లేచి ఆయన అభ్యంగనస్నానమొనర్చాడు. మణిమయాలంకృత స్వర్ణ భూషణుడగుచున్నాడు.

సభాభవనము దేవేంద్రసభాభవనమునకన్న లెస్సగా అలంక రించబడింది.

చారుగుప్తుడు కుడిభుజముపై చేయివేసి నడువగా, శుక్తిమతీదేవి చిటికెనవ్రేలును బట్టుకొని శ్రీముఖుడు సభాభవనాన్ని చేరుకొన్నాడు.

భూసురులు ఆయన్ను ఆశీర్వదించారు.

వందిమాగధులు ఆయన బిరుదములను చదివి, ఆయన విజయ గాథలను వల్లించారు.

ప్రభువు సింహాసనముపై కూర్చున్నాడు. ఆయనకు ఎడమ ప్రక్కనగల సింహాసనములను యువరాజు శ్రీకృష్ణశాతవాహనుడు, మంజుశ్రీ రాకుమారుడు అధిరోహించారు. చక్రవర్తికి కుడివైపున చారుగుప్తవర్తకసార్వభౌములు. ఆయన వెనుక అచీర్ణమహామాత్యులు, ధర్మనంది సముచితాసనాల నలంకరించారు. చారుగుప్తులకు ప్రక్కన సోమదత్తాచార్యులు కూర్చొని ఉన్నారు.

పట్టాభిషేకమహోత్సవ వేదికకు దిగువన సువర్ణశ్రీ, సమవర్తి, శుకబాణులు కూర్చొన్నారు.

ఆ సింహాసన వితర్దికకు ఎడమవైపున ఏర్పాటు చేయబడిన బంగరు గద్దెలపైన అమృత పాదార్హతులు, స్థూలతిష్యుడు ఆసీనుడై ఉన్నాడు.

సర్వసైన్యాధిపతి స్వైత్రులు సంపూర్ణకవచధారియై కత్తిబట్టి, మహారాజువద్ద నిలబడి ఉన్నాడు.

సామంతులు, రాజులు, కవులు, గాయకులు, సంగీత విద్వాంసులు, శిల్ప,చిత్ర లేఖనాది విద్యల్లో ఆరితేరిన వారు అనేకమంది ఆ అభిషేకోత్సవానికి అరుదెంచారు. మ్లేచ్ఛ, యవన దేశాలనుండి రాయబారులు, రాజపురుషులు కూడ వచ్చారు.

శ్రీముఖమహారాజు యొక్క పట్టాభిషేకమహోత్సవము ఆర్యధర్మము, బౌద్ధధర్మముల రెండింటి ప్రకారమూ జరిగింది.

ఐతరేయబ్రాహ్మణముననుసరించి స్థూలతిష్యుడు సార్వభౌమ పట్టాభిషేకాన్ని చేసి కిరీటాన్ని తలపై ఉంచాడు.

"ధర్మ సుత్తము" ననుసరించు అమృతపాదులు అభిషేకం చేశారు.

ఆ సమయమున బ్రాహ్మణపండితులు శ్రీ సూక్త, పురుష సూక్తములను, శాంతిమంత్ర, స్వస్తివాచకాలను ఉచ్చైస్వరమున చదువగా, బౌద్ధపండితులు దమ్మసత్తముల నుండి మంత్రాలను చదివారు.

శ్రీముఖ శాతవాహన సార్వభౌమ పట్టాభిషేకమహోత్సవాన్ని తిలకిస్తున్నంత సేపూ, చారుగుప్తులవారి కన్నులనుండి ఆనంద బాష్పాలు రాలుచూనే ఉన్నాయి.

అనంతర మా సార్వభౌముడు సింహాసనముపైనుండి లేచి ఆ వితర్ధికను దిగివచ్చి, చారుగుప్తులవారిని సకలజంబూద్వీప సామ్రాజ్యానికి మహామంత్రిగా అభిషేకించి ముద్రికలు ఇచ్చాడు.

ఆ తరువాత కొన్నాళ్ళు గడచాయి. ఒక శుభముహూర్తమున సువర్ణశ్రీ హిమబిందువుల వివాహాన్ని చారుగుప్తుడు జరిపించాడు. ఆ సమయమున ఆయన పేదలకు, విప్రులకు అశేష దానాలను చేశాడు. ఆరామాలకు, దేవాలయాలకు భూరివిరాళాలు ఇచ్చాడు.

విషవైద్యుల చికిత్స వల్ల విషకన్య సంపూర్ణ విషరహితయై, అమృత కన్య అయిందని విన్న సార్వభౌముడు శ్రీకృష్ణ శాతవాహనుల, అమృత కన్యల వివాహాన్ని జరిపించాడు.

పాటలీపుత్ర విజయానికి ప్రధానకారణభూతుడైన 'సువర్ణశ్రీ'ని సార్వభౌముడు ఉత్తరాంధ్ర సామ్రాజ్యానికి ప్రతినిధిగా అభిషేకించాడు.

పాటలీపుత్రము రాజధానిగా ఉత్తరాంధ్రాన్ని పాలించిన సువర్ణశ్రీ వారిర్వురి ప్రేమకు చిహ్నంగా ఆంధ్రులశిల్పకళావైభవానికి ప్రతీకగా "కోసలదేశము" లో ఒక స్థూపాన్ని నిర్మించాడు.

సువర్ణశ్రీ శిష్యులు గాంధార, పారసీక, బాహ్లీక మొదలగు దేశాలకు వెళ్ళి తమ ఆంధ్రశిల్పకళానైపుణ్యాన్ని ప్రతిష్ఠించారు.

సువర్ణశ్రీ, హిమబిందుల ప్రేమమయ జీవితాన్ని కన్నుల కరువు దీరా చూస్తూ, ఆమె అనుభవిస్తున్న మహానందానికి మురిసిపోతూ, చారుగుప్త మహామాత్యులు ఈ ఆంధ్ర శాతవాహన మహా సామ్రాజ్యాన్ని వేయికన్నులతో కాపాడాడు.

కవులు - సువర్ణశ్రీ, హిమబిందుల ప్రేమ జీవితాన్ని గ్రంథాలుగా, కావ్యాలుగా రచించారు. జానపదులు వారి ఆదర్శదాంపత్యాన్నీ, అనురాగజీవితాన్నీ పాటలుగా పాడుకొన్నారు.

హిమబిందు కడుపు పండింది. ఆ దంపతులాపుత్రునికి "చారుగుప్తుడు" అనే నామకరణం చేశారు. చారుగుప్తమహామాత్యులు తాతయ్య అయ్యాడు.

కార్తాంతికులు ఆ బాలుని జన్మ సమయమున తారాపథమున గల గ్రహసంపత్తిని లెక్కించారు.

"ఈ బాలుడు ఈ పాటలీపుత్రమున ఒక మహాసామ్రాజ్యస్థాపనకు మూలపురుషుడు ఔతాడు"

అన్నారు.

అయిపోయింది

*ఈ "చారుగుప్త' అడవి బాపిరాజుగారి "హిమబిందు" ఆధారంగా వ్రాయబడింది. ఆ కళాతపస్వికి నా కృతజ్ఞతలు.*

# ఈ నవలలోని కొన్నిపదాలు - అర్థాలు - వివరాలు

**ధాన్యకటకము :-** గుంటూరు జిల్లాలోని నేటి అమరావతి - ధరణి కోటలు కలిసి ఉన్న ప్రదేశములో ఉండినది. అప్పుడు ఈ ధాన్యకటక వైశాల్యము 12 చదరపు మైళ్ళు. జనసంఖ్య సుమారు 30 లక్షలు.

**గరళము :-** నాగుపాముविషము.

**వినయపిటకము :-** బౌద్ధమతానికి అతిప్రధానమైనవి త్రిపీటకాలు. వినయపిటకం మూడవది. బౌద్ధబిక్షువుల జీవనవిధానానికి సంబంధించి తథాగతుడు వచించిన నియమనిబంధనలు వినయపిటకంలో ఉన్నాయి. మొదటిది సుత్త పిటకం. రెండవది అభిదమ్మ పిటకం. సుత్త పిటకం బుద్ధుని మరణానంతరము జరిగిన మొదటి సంగీతిలోని బుద్ధుని బోధనలు గల గ్రంథం. అభిదమ్మ పిటకం బౌద్ధమత సూత్రము లకు వ్యాఖ్యానము.

**హీనయానం :-** బౌద్ధమతములోగల శాఖల్లో మొదటిశాఖ హీన యానం. హీనయానశాఖవారు బుద్ధుని విగ్రహరూపంలో ఆరాధిం చేందుకు అంగీకరించరు.

**మహాయానం:-** బౌద్ధమతశాఖల్లో రెండవది మహాయానం. బుద్ధుని మరణానంతరము క్రీ॥పూ॥ 444 లో లిచ్ఛవిరాజధాని వైశాలిలో రెండవ సంగీతి జరిగింది. బౌద్ధభిక్షువులు ధన, ధాన్య సంపదలను స్వీక రించ వచ్చునా? కూడదా? అన్నది రెండవ సంగీతిలో ప్రధాన చర్చనీ యాంశం. 700 మంది భిక్షువులు ధన, ధాన్య సంపదలను స్వీకరించకూడదు అన్నారు. స్వీకరించకూడదు అన్నవారు థైరవాదులయ్యారు. తాత్వికంగా వీరు సౌత్రాంతికులు. సూత్ర వచనములే ప్రమాణమని వీరి విశ్వాసం. బౌద్ధభిక్షువులు ధన, ధాన్య సంపదలను స్వీకరించవచ్చు అన్న వారిని వీరు బహిష్కరించారు. బహిష్కృతులైన పదివేలమంది వేరే సభ జరిపి మహాసాంఘికులైనారు. ఈ శాఖే మహాయానశాఖగా ఏర్పడింది.

"కనిపించే దృశ్యప్రపంచమంతా, పరిణామశీలం కనుక వాస్తవంకాదు. మార్పులేని శాశ్వత సత్యం వేరొకటి ఉంది." అనేది మహాయానవాదుల ప్రతిపాదన. మహాయానశాఖవారు బుద్ధుని విగ్రహరూపంలో పూజించ వచ్చు అంటారు.

**మాధ్యమికవాదం :-** "ఏదీవాస్తవంకాదు. అవాస్తమూకాదు. ప్రతిదీ పరస్పరాధారంగా ఉంటుంది" అనేది మాధ్యమిక వాదం. ఈవాదాన్ని ప్రవేశపెట్టినవాడు ఆచార్య నాగార్జునుడు. ఈ పరస్పరాధారం అనుదాన్నే నాగార్జునుడు శూన్యవాదం (RELATIVITY) అని వ్యవహరించాడు. నాగార్జునుడు క్రీ॥శ॥ 180 ప్రాంతము వాడు.

**ఆర్షమతము :-** ఋషిప్రోక్తమైన మతము.

**ఆర్షసిద్ధాంతము :-** ఆర్షమతమునకు సంబంధించిన సిద్ధాంతము.

**శ్వేతోరగులు :-** తెల్లని పాములు.

**కృష్ణోరగులు :-** నల్లనిపాములు.

**శృంగి :-** ఒకరకమగు విషము

**నాభి :-** వసనాభి. దీన్నేక్షుద్రనాభి, తెల్లనాభి అనికూడ అంటారు. తొమ్మిదిరకాల విషాల్లో ఒకటి.

**సౌరాష్ట్రము :-** తొమ్మిది రకాల విషాల్లో ఇదీ ఒకటి. ఒక విధమగు కంచుతో ఈ విషాన్ని తయారు చేస్తారు. సన్నరాష్ట్రము అనికూడ అంటారు.

**శాక్లికేయం :-** నవవిధ విషాల్లో ఒకటి.

**దారదము :-** విషభేదము - పాదరసము.

నల్లనాభి.

**ఆభాసరూపములు :-** మారు రూపములు. అధ్యాత్మికంగా ఈ పదము ఎక్కువగా వాడుకలో ఉంది.

**సాంఖ్యులు:-** సమ్యక్‌జ్ఞానాన్ని కలిగించేది సాంఖ్యవాదం. సమ్యక్‌జ్ఞానం అనగా సరియైనజ్ఞానం. సాంఖ్యవాదాన్ని అనుసరించేవారు సాంఖ్య వాదులు. సాంఖ్యవాదం జ్ఞానప్రధానమైన సిద్ధాంతంగలది. ప్రపంచ మంతా దుఃఖమయం అని బౌద్ధులు, సాంఖ్యులూ అంగీకరిస్తారు. దుఃఖంలోనుంచీ బైటపడాలంటే అష్టాంగమార్గం, ప్రజాసేవ ముఖ్యం అంటారు బౌద్ధులు. దుఃఖంనుంచీ బైటపడేందుకు అష్టాంగమార్గాలు వ్యర్థం అంటారు సాంఖ్యులు. ప్రకృతి, పురుషుడు ఈరెండూ ప్రపంచానికి మూలం. ప్రతిదీ సుఖ, దుఃఖాలలో ఏదో ఒకదాన్ని కలిగిస్తుంది. ప్రతిదీ పరిణామంచెందుచూ ఉంటుంది. పరిణామశీలమైన, కార్యకారణ బద్ధమైన ఈ ప్రపంచానికి మూలం మార్పులేని ప్రకృతి, పురుషుడు. ఈ రెండూ స్వయం సిద్ధాంతాలు.

**ఘటిక :-** ఇరువదినాలుగు నిమిషముల కాలము.

**లంబికాయోగం :-** యోగాలలో ఇదీ ఒకటి. లంబికాయోగంలో ఉండేవారు దీర్ఘకాలం జీవిస్తారంటారు.

**నవోఢ :-** నూతనవధువు. ఆధునికులు పలువురు ప్రయోగించారు.

**అతిమధురము :-** ఓషధులలో ఒకటి. దప్పికను తీర్చుతుంది.

**ఇప్పతీగ:-** దప్పికను తీర్చుతుంది. మధూలిక అనికూడ దీనికి పేరు.

**వత్సాధుని :-** తిప్పతీగ. దప్పికను తీర్చుతుంది

**సోమవల్లి:-** సోమతీగ. యజ్ఞములో ఉపయోగిస్తారు. శుద్ధపాఢ్యమి నుండీ పౌర్ణమి వరకూ, రోజుకు ఒక ఆకు చొప్పున పౌర్ణమి (15) నాటికి 15 ఆకులు వేస్తుంది. బహుళ పాడ్యమి నుండీ రోజుకు ఒక ఆకు ప్రకారం అమావాస్యనాటికి 15 ఆకులనూ రాల్చుతుంది. సోమరసము విషాన్నిహరిస్తుంది.

**నిర్గుండి :-** నల్లవావిలిచెట్టు.

**శ్వేతసురస :-** తెల్లవావిలి చెట్టు (తెల్లగరిక). తెల్లవావిలి, నల్లవావిలి అని ఇది రెండు రకాలు. విషాన్ని హరిస్తుంది.

**మధూలిక :-** ఇప్పతీగ

**కర్పూరశిలాజిత్తు :-** సిలాజితు అని కూడ పిలుస్తారు.

**విఘడియ :-** ఘడియ (గడియ) లో అరవైవ భాగము.

**పరకీయ :-** ఇతరునిది. స్వీయ, పరకీయ, సామాన్య అను మూడు రకాల నాయికలలో రెండవది కూడ.

**ఐతరేయబ్రాహ్మణము :-** ఋగ్వేదానికి సంబంధించిన బ్రాహ్మణములలో ప్రసిద్ధమైంది ఐతరేయము. మహిదాసు ఈ ఐతరేయానికి కర్త. 8 సంచికలు, 285 ఖండికలుగా విభజింపబడి 40 అధ్యాయాలు గలది ఐతరేయబ్రాహ్మణము. అగ్నిష్టోమ, ఉక్థ, అతి రాత్రి, రాజసూయాది యజ్ఞవిధానమూ, ఇంద్రమహాభిషేకము, సామ్రాజ్య పట్టాభిషేక విధానాలు ఐతరేయబ్రాహ్మణములలో వివరించబడినవి. బ్రాహ్మణము అనగా మంత్రానికి భాష్యము. మంత్రార్థాలను, యజ్ఞ విధులను వివరించి చెప్పు మంత్రములు అనికూడ అర్థం.

**త్రిఫలములు :-** కరక్కాయ, తాండ్ర, ఉసిరిక ఈ మూడు వరుసగా శరీరములోని వాత, పిత్త, శ్లేష్మములను పోగొడ్తాయి. ఉసిరికరసము అమృతముతో సమానమంటారు.

**అమృతఫలము :-** చిన్న మారేడుపండువలె ఉంటుంది. ఇది కాబూలు దేశఫలం. కాబూలులో ఈఫలాన్ని 'నాస్పాల్' అంటారు. పంజాబ్‌లో ఈ ఫలాన్ని 'నాల్' అంటారు.

